ఓం నమో విశ్వకర్మ పరబ్రహ్మణే

# విశ్వకర్మ వైదికమంత్ర సంహిత

## ప్రథమభాగము



రాష్ట్ర విశ్వబ్రాహ్మణ పురోహిత పరిషత్తు - తెనాలి

# విశ్వకర్మ వైదిక మంత్ర సంహిత

## ప్రధాన సంపాదక మండలి

**శ్రీ కందుకూరి వేంకట గోవిందేశ్వర శర్మ**

రాష్ట్ర విశ్వబ్రాహ్మణ పురోహిత పరిషత్తు అధ్యక్షులు

పీఠాధిపతి : శ్రీ కామాక్షీదేవి పూజాపీఠం, విజయవాడ.

---

**శ్రీ ఆరికట్ల గోవర్ధన శాస్త్రి**

రాష్ట్ర విశ్వబ్రాహ్మణ పురోహిత పరిషత్తు ప్రధాన కార్యదర్శి

శ్రీ ఈశ్వరీదేవి పూజాపీఠం - పీఠాధిపతి - విజయవాడ.

---

**శ్రీ ఆలూరి సుబ్రహ్మణ్యశర్మ**

రాష్ట్ర విశ్వబ్రాహ్మణ పురోహిత పరిషత్తు కోశాధికారి

శ్రీ ఆలూరి అగ్రహారం గారి విశ్వబ్రాహ్మణ స్మార్తాగమ పాఠశాల, గుంటూరు.

---

**శ్రీ పడకండ్ల వేంకటాచార్య గురుకల్**

శ్రీ జగద్గురు ఆదిశంకరాచార్య వేదధర్మ పీఠమ్, హైదరాబాద్.

---

**శ్రీ ఇడమకంటి జనార్ధన శివాచార్య**

శ్రీ శర్వాణి శైవాగమ విద్యాపీఠం - వ్యవస్థాపక ప్రధానాచార్యులు

పండిత్ శ్రీ యలవర్తి ఆంజనేయశాస్త్రి విశ్వబ్రాహ్మణ

వేద సంస్కృత పాఠశాల ప్రధానాచార్యులు - తెనాలి.

## సంపాదక మండలి

“నిగమాగమ కళాకోవిద” “మహామహోపాధ్యాయ”

**శ్రీ డా॥ ప్రదపాటి నాగేశ్వరరావు గారు**

ఆస్థానకవి శ్రీ వీరబ్రహ్మేంద్రస్వామి మఠం - కందమల్లయ్యపల్లి.

**డా॥ నాగమంగల నిరంజనాచార్య**

వైశ్వకర్మణ భావన విశ్వకర్మపీఠం - వ్యవస్థాపకాచార్యులు, బెంగుళూరు.

---

**డా॥ చంద్రపాటి నాగవరప్రసాదరావు**

ప్రొ॥ రాష్ట్రీయ సంస్కృత విద్యాపీఠమ్, ఒరిస్సా.

---

**బ్రహ్మశ్రీ అప్పసముద్రం వేంకట శేషాచార్యులు**

విశ్వకర్మాగమవాస్తు జ్యోతిష పండిట్ - అప్పసముద్రం

---

**బ్రహ్మశ్రీ వడ్లమాను గోవర్ధనాచార్యులు**

ఆగమశిల్పి వాస్తు సిద్ధాంతి - పుల్లలచెరువు.

---

**బ్రహ్మశ్రీ డా॥ చింతాడ గిరినాథ్ శర్మ**

విశ్వకర్మ బ్రాహ్మణ వాఙ్మయ పరిశోధకులు - ఒంగోలు.

---

**బ్రహ్మశ్రీ చెర్వుపల్లి గోవిందస్వామి వారు**

శతాధిక ప్రతిష్ఠాపనాచార్యులు - కందిమల్లయ్యపల్లి

---

**బ్రహ్మశ్రీ గోనుగుంట బ్రహ్మనందశర్మ**

శ్రీ ఆంజనేయస్వామి పూజాపీఠం - ఒంగోలు

---

**బ్రహ్మశ్రీ డా॥ ఆదిపూడి వేంకట శివసాయిరామ్**

శతాధిక గ్రంథకర్త - గుంటూరు.

---

**బ్రహ్మశ్రీ అత్తలూరి బాలశంకరశాస్త్రి**

శ్రీ జగన్మహాముసీశ్వర ఆశ్రమ వేద సంస్కృత పాఠశాల కాల్వ శ్రీరాంపూర్

---

**బ్రహ్మశ్రీ కందుకూరి వేంకట సత్య బ్రహ్మాచార్య**

శైవాగమ పండిట్ - తిరుమల తిరుపతి దేవస్థానం పూర్వ విద్యార్థి

---

**బ్రహ్మశ్రీ జ్యోతిమురుగాచార్య - వేలూరు**

విశ్వకర్మ స్మార్త, ఆగమ వాస్తు జ్యోతిష పండిట్

# నివేదనమ్

ఏషదేవో విశ్వకర్మా మహాత్మా, సదాజనానాం హృదయే సన్నివిష్టః. హృదా మనీషాఽభిక్లుప్తః తుఏతద్విదురమృతాస్తే భవన్తి ॥

ప్రాచీనమైన విశ్వబ్రాహ్మణ సంస్కృత సంప్రదాయాలు గురించి ఇచ్చట మనము ప్రస్తుతించుట లేదు. శతవసంతములకు పూర్వమే పండిత శ్రీ యలవర్తి ఆంజనేయశాస్త్రి గారు తాను ఆర్జించిన సర్వస్వమును విశ్వబ్రాహ్మణ ఔన్నత్యమునకు, వేదాగమ సంస్కృత విద్యావ్యాప్తికై ధారపోశాను. తానే స్వయం వేదాగమ సంస్కృత పాఠశాలను స్థాపించి ఉపాధ్యాయులై బోధించియున్నారు. ఈ విద్యాసంస్థలో శ్రీ చామర్తి అమరేశ్వర శర్మగారు, బండకట్ల కోటేశ్వరశాస్త్రి, చందవోలు బ్రాహ్మణాచారి, శ్రీ పామర్తి నాగభూషణశర్మ గారు, మోటుమర్రి రాఘవాచార్యులు గారు, కొండూరి వీరరాఘవాచార్యులుగారు మొదలగు ఎందరెందరో స్మార్తాగమ సంస్కృత విద్యలను బోధించియున్నారు. వీరికి ఆదర్శప్రాయులుగా గారపాడు వాస్తవ్యులు పరబ్రహ్మ కూడా సుక్షేత్రమైన పొలాన్ని అమ్మి విశ్వబ్రాహ్మణ జాతి అభ్యున్నతికి తోడ్పడియున్నారు. వడ్డెపాటి కోటేశ్వరశాస్త్రి గారి శిష్యులైన శ్రీ పామర్తి నాగభూషణశర్మ గారి నుండి మన సనాతన విశ్వకర్మ బ్రాహ్మణ సంప్రదాయ అధ్యయన పద్ధతిని మేము గ్రహింపబడి కుము వృద్ధిలోనికి వచ్చి మేము అధ్యయనం చేసిన విశ్వకర్మ వైదిక మంత్రములను వానితోపాటు అనేక సూక్త ఉపనిషత్ స్తోత్ర సుప్రభాత వ్రత కల్పములన్నింటిని కలిపి ఒకే పుస్తకముగా ఉంటే బాగుంటుందని అభిప్రాయపడుతున్న తరుణంలో ఈ మా ఉద్యమానికి శ్రీ పళ్ళి సిద్ధార్థగారు ప్రోత్సహించారు. సంకలనంలో మమ్మల్ని వెన్నంటి ఉన్న సోదరులందరికి మా ధన్యవాదములు. ఈ గ్రంథ రాజము విశ్వబ్రాహ్మణ వంశజులకు ఎంతో ఉపకరిస్తుందని ఆశిస్తున్నాము. సనాతన సంప్రదాయ గ్రంథ ముద్రణలలో విశ్వబ్రాహ్మణ సోదరులకు శుభము జేకూరవలెనని కోరుకుంటూ....

**రాష్ట్ర విశ్వబ్రాహ్మణ పురోహిత పరిషత్ - తెనాలి.**

# రాష్ట్ర విశ్వబ్రాహ్మణ పురోహిత పరిషత్ - తెనాలి.



**శ్రీ కందుకూరి**
**వేంకట గోవిందేశ్వర శర్మ**

శ్రీ కామాక్షీదేవి పూజాపీఠం పీఠాధిపతి, విజయవాడ.
రాష్ట్ర విశ్వబ్రాహ్మణ పురోహిత పరిషత్తు అధ్యక్షులు
మొబైల్ : 9848577423, 9441320877



**శ్రీ ఆరికట్ల గోవర్ధన శాస్త్రి**

శ్రీ ఈశ్వరీదేవి పూజాపీఠం పీఠాధిపతి, విజయవాడ.
రాష్ట్ర విశ్వబ్రాహ్మణ పురోహిత పరిషత్తు ప్రధాన కార్యదర్శి
మొబైల్ : 9440172645



**శ్రీ ఆలూరి సుబ్రహ్మణ్యశర్మ**

శ్రీ ఆలూరి అగ్రహారం గారి విశ్వబ్రాహ్మణ స్మార్తాగమ
పాఠశాల ప్రధానోపాధ్యాయులు, గుంటూరు.
రాష్ట్ర విశ్వబ్రాహ్మణ పురోహిత పరిషత్తు కోశాధికారి
మొబైల్ : 9849556229



**శ్రీ ఇడమకంటి జనార్థన శివాచార్య**

శ్రీ శర్వాణి శైవాగమ విద్యాపీఠం, తెనాలి
శ్రీ పండిత శ్రీయలవర్తి ఆంజనేయశాస్త్రి విశ్వబ్రాహ్మణ
వేదసంస్కృత పాఠశాల, తెనాలి - ప్రధానోపాధ్యాయులు
రాష్ట్ర విశ్వబ్రాహ్మణ పురోహిత కార్యాలయం - కార్యదర్శి
మొబైల్ : 9963349294, 9440537681

# శ్రీ విశ్వకర్మ పరమేశ్వర యజ్ఞ మహోత్సవం

పరమాత్మ విశ్వకర్మకు పుట్టిన రోజు లేదు. సృష్టి అనాది యని బ్రహ్మ సూత్రము చెబుతున్నది, నేల, నీరు, గాలి, నిప్పు ఆకాశం వంటి పంచ భూతాలు ఎప్పుడు పుట్టాయో ఎవరూ చెప్పలేదు, అలాంటప్పుడు వాటిని శాసించే పంచ బ్రహ్మలకు పుట్టిన తేదీలు ఎలా ఉంటాయి? వేదంలో అలాంటి ఆధారం లేదు. అవతారపురుషులైతే ఫలాన అప్పుడు అవ తరించారు, ఫలాన రోజున అవతారం చాలించారని చెప్పవచ్చు. సృష్టికి ముందే అ పరమాత్మనుండి ఆవిర్భవించిన వారికి పుట్టినరోజులు జరపటం మనం కల్పించుకున్నది. విశ్వకర్మ పూజా మహోత్సవం గురించి పురాణాలలో ఓ కథ ఉన్నది. అత్యంత పూర్వకాలంలో ఒకప్పుడు ఈ భూమి మీద భయంకరమైన క్షామం ఏర్పడిందట. ఏ జీవికి ఆహారం లేదు. అపుడు పృథు చక్రవర్తి సృష్టికర్తను గురించి ఘోరమైన తపస్సు చేసాడు. ఆ తపస్సుకు మెచ్చిన విశ్వకర్మ భగవానుడు పంచముఖములతో పంచఋషుల సమేతంగా మాఘశుద్ధ త్రయోదశి రోజున పృథుచక్రవర్తికి దర్శనమిచ్చి వరాలు ప్రసాదించాడట. అందువలన ఈ భూమి మరల సస్యశ్యామలమై, సుభిక్షంగా తయారై ఆహార సమృద్ధితో వర్ధిల్లినది. పృథు చక్రవర్తి కోరిక మేరకు పంచఋషులైన సానగ సనాతన, అహభూన ప్రత్న, సుపర్ణ ఋషులు భూమిపై అవతరించి పంచశిల్ప వృత్తులతో మానవులకు నగరములు నిర్మించి, వ్యవసాయము నేర్పి, సమాజంలో కుటుంబ వ్యవస్థను నెలకొల్పి నాగరికతా నిర్మాతలయ్యారు. ఆ తరువాత విశ్వకర్మ భగవానుడు తనకు సాక్షాత్కరించిన మాఘశుద్ధ త్రయోదశినాడు తన ప్రజలందరు విశ్వకర్మ పూజామహోత్సవం జరపాలని పృథు చక్రవర్తి శాసించాడట. ఆ విధంగా విశ్వకర్మ పూజామహోత్సవం

జరిపే సాంప్రదాయం ఏర్పడింది. ఈ పంచఋషులు విశ్వకర్మ నుండి ఆవిర్భవించినవారేనని యజుర్వేద మంత్రాలను బట్టి, ఉపనిషత్తులబట్టి, తెలుస్తుంది. వారు విశ్వబ్రాహ్మణ గోత్ర ప్రవర్తకులు. ప్రపంచ నాగరికతా నిర్మాతలు. అంతేకాదు వారు మానవజాతికి వేదవిజ్ఞానం నేర్పిన తొలి బ్రహ్మ విద్యా ప్రవర్తకులని బృహదారణ్యకోపనిషత్‌లో చెప్పబడినది.

ఒకప్పుడు మాఘశుద్ధ త్రయోదశి రోజున విశ్వకర్మ భగవానుని పూజించే వారిమి, అలాగే పంచఋషులను భాద్రపద శుక్ల పంచమిరోజున (ఋషిపంచమి) రోజున పూజించే వారిమి. అది కాస్త మరచిపోయిన భృగ్వాంగిరస వంశీయులు వ్యాసులవారు వ్రాసిన పురాణ కథల పుణ్యమాని వారి గోత్రంలో దేవశిల్పి విశ్వకర్మ ప్రభాసుని కుమారునిగా జన్మించాడని ఆరోజున, సెప్టెంబర్ 17 న (సూర్యుడు కన్యా రాశిలో ప్రవేశించిన కన్యా సంక్రమణం రోజు) దేవశిల్పికి జన్మదినం చేయటం మొదలు పెట్టారు. ఆ దేవశిల్పి, పరమాత్మ విశ్వకర్మ ఒకరే అని ఉత్తరాది భృగ్వాంగిరస గోత్రాల వారి నమ్మకం, అదే ప్రచారం. వేదజ్ఞానం లేని మిగతా పంచఋషి గోత్రాల వైశ్వకర్మణులు వారిని అనుకరించి విశ్వకర్మకు జయంతి మొదలు పెట్టారు. ఇది వాస్తవం. విశ్వకర్మ పరమేశ్వరునికి, పంచబ్రహ్మలకు జయంతులు జరుపుకోవటం అనేది మన అజ్ఞానం. ఒక వేళ విశ్వకర్మను పూజించటానికి ఓ మంచి రోజు ఉండాలని భావిస్తే, పూర్వాచారం ప్రకారం మాఘశుద్ధ త్రయోదశి నాడు విశ్వకర్మను పూజించండి. లేదా చైత్ర శుద్ధ పౌర్ణమి నుండి ప్రతి నెలా పౌర్ణమి రోజున విశ్వకర్మ తో బాటు పంచబ్రహ్మలను పూజించండి. అది సముచితమని భావిస్తున్నాను. కాదు సెప్టెంబరు 17 ముఖ్యం అనుకుంటే, విశ్వకర్మకు జయంతిగా కాక "విశ్వకర్మ యజ్ఞ మహోత్సవం" అనో పూజా మహోత్సవం అనో ప్రకటించవలసినది.

ఈ దిగువ వేదమంత్రములను పరిశీలించగా విశ్వకర్మకు యజ్ఞ మహోత్సవము జరుపుట వైదిక సాంప్రదాయమని మనము గ్రహించ వచ్చును. ఈ భూమి తనగురుత్వాకర్షణ కోల్పోయి విశ్వచైతన్యమనెడి సముద్రములో మునిగినపుడు భూమిని ఉద్ధరించినది విశ్వకర్మ భగవానుడు. అట్టి భగవానుడే మానవులను ఉద్దరించి మోక్ష మొసగువాడని వేదఋషుల అభిప్రాయము కనుక వారు ఈ భూమిపై భగవంతుని కొరకు యజ్ఞమునులు చేయుచు విశ్వమానవ శ్రేయస్సు సాధించిరని గ్రహించవలెను.

**మంత్రం:** ***యా మన్వైచ్ఛద్ధవిషా విశ్వకర్మా***
***అంతరర్ణవే రజసి ప్రవిష్టామ్***
***భుజిష్యం పాత్రం నిహితం గుహా***
***యదావిర్భోగే అభవన్ మాతృమద్భ్యః ॥*** అథర్వ. 12. 1. 60.

**తా:** నీటియందు మునిగిపోయిన ఏ భూమాతను విశ్వకర్మ భగవానుడు ఆ జలమునందు ప్రవేశించి పైకి లేవనెత్తెనో, విశ్వకర్మ భగవానుడు ఏ భూమిని జీవభోగ్యముగా చేసెనో ఆ భూమి మమ్ము రక్షించుగాక ! ఆభూమి మాకు భోగ్యమగుగాక !

◆ పురాణాలలో వ్యాస మహర్షి విశ్వకర్మ మహిమలను విష్ణు మహిమలుగా వర్ణించుచు అనేక కథలు వ్రాసెను. ఆవిషయం మనకందరికి తెలియును.

**మంత్రం :** ***యస్యాం వేదిం పరిగృహ్ణన్తి భూమ్యాం***
***యస్యాం యజ్ఞం తన్వతే విశ్వకర్మాణః***
***యస్యాం మీయన్తే స్వరవః పృథివ్యాం***
***ఊర్ధ్వాః శుక్రా ఆహుత్యాః పురస్తాత్***
***సా నో భూమిర్వర్ధయద్వర్ధ మానా ॥*** అథర్వ. 12. 1. 13.

**తా.** యే భూమియందు యజ్ఞవేదికను నిర్మించి విశ్వకర్మలు (విశ్వకర్మ

వంశీయులగు సానగ సనాతన, అహభూన, ప్రత్న, సుపర్ణాది బ్రహ్మర్షుల సంతానము) యజ్ఞము లొనర్తురో అట్టి భూమి తాను వృద్ధి పొందుతు (ఆహార సమృద్ధితో) మమ్ము వృద్ధి పొందించు గాక !

◆ ***వాచస్పత ఋతవః పంచ యేనో వైశ్వకర్మణాః*** (అథర్వ. 13. 1. 18 మంత్రము వలన విశ్వకర్మ వంశీయులు పంచ బ్రహ్మర్షుల సంతానమని తెలియుచున్నది. **"యస్యాం యజ్ఞం తన్వతే విశ్వకర్మణః"** అని ఈ మంత్రము నందు చెప్పబడి యుండుటచే విశ్వ శ్రేయస్సును కోరి విశ్వకర్మ వంశీయులు విశ్వమునందు యజ్ఞమును వృద్ధి పరచిరని తెలియుచున్నది. కనుక శ్రీ విశ్వకర్మ పూజతో బాటు వీలున్నచో యజ్ఞము చేయుటయు వైశ్వకర్మణ సాంప్రదాయము.

ఓం నమో విశ్వకర్మణే, బ్రహ్మాదిభ్యో బ్రహ్మవిద్యా సంప్రదాయ ప్రవర్తకేభ్యో వంశఋషిభ్యో నమో గురుభ్యః ॥

ఓం శాంతిః శాంతిః శాంతిః ॥

ఓం నమో విశ్వకర్మణే ! సత్యమేవ జయతే !

**– బ్రహ్మశ్రీ చిలుకూరి వేంకటప్పయ్య అచార్యులు.**

తేది. 12. 9. 2019.

# శ్రీ విశ్వకర్మాష్టకం

**జగద్గురు ఆదిశంకరాచార్య**

## ఆంధ్రానువాదం

**శ్లో॥ శ్రీ కరార్చిత సత్య శాశ్వత లోక నిర్మిత నిర్జరా ।**
**పాకశాసన పద్మజాది సురా సురార్చిత భాస్కరా ।**
**ఏకమేవ బ్రహ్మమూర్తి పినాక సంస్థిత శంకరా ।**
**శోక వర్జిత శంభునామక విశ్వకర్మ జగత్ప్రభో ॥ 1**

హే విశ్వకర్మ జగత్రభూ !

నీవు పరమేశ్వరుని చేత పూజింపబడుచున్న వాడవు. సత్య స్వరూపుడవు శాశ్వతుడవు. సమస్త లోకములను నిర్మించువాడవు. ముదిమి లేనివాడవు ఇంద్రుడు బ్రహ్మ మున్నగు దేవతల చేతను అసురుల చేతను పూజింప బడుచున్నవాడవు. స్వయం ప్రకాశకుడవు అద్వితీయమైన బ్రహ్మమూర్తివి; సుఖమును కలిగించువాడవు. దుఃఖమును అతిక్రమించినవాడవు, శంభు అను పేరుగలవాడవు. అట్టి నీకు నమస్కారము.

**శ్లో॥ సర్వనాయక సర్వదాయక సర్వసాక్షి మహేశ్వరా ।**
**సర్వరాజిత సర్వపూజిత సర్వకార్య దురంధరా ।**
**సర్వశిక్షక సర్వభక్షక సర్వరక్షక శ్రీకరా ।**
**సర్వసద్గుణ సర్వనామక విశ్వకర్మ జగత్ప్రభో ॥ 2**

హే విశ్వకర్మ ప్రభూ !

నీవు సర్వమునకు ప్రభువైనవాడవు. సమస్త సుఖముల నిచ్చువాడవు. సమస్త కార్యములకు సాక్షి భూతుడవు. మహాప్రభుడవు. అన్నిటియందు ప్రకాశించువాడవు. సమస్త పాపములను హరించువాడవు. సమస్త ప్రాణులను రక్షించువాడవు, సంపదల నిచ్చువాడవు సమస్త సద్గుణములు గలవాడవు. సమస్త నామములు గలవాడవు. అట్టి నీకు నమస్కారము.

**శ్లో॥ స్వర్ణరూప సువర్ణలోక సర్వ కాంతి మనోహరా ।**
**వర్ణరాజిత వర్ణవర్జిత వర్ణరాజ విధాకరా ।**
**వర్ణవాచక వర్ణసంభవ వర్ణవేద జటాధరా ।**
**వర్ణవర్ణాతీతవర్ణన విశ్వకర్మ జగత్రభో ॥ 3**

హే విశ్వకర్మ ప్రభూ!

నీవు అన్ని రూపములు గలవాడవు. స్వర్గలోకమందుండు వాడవు. సూర్యచంద్రాది రూపముల ద్వారా కాంతి నిచ్చుచూ మనస్సులను రంజింప జేయుచున్నవాడవు. విశ్వకర్మ ప్రభు అను అక్షరములతో ప్రకాశించుచున్న వాడవు, కులమత వర్జితుడవు. సద్విధులను విధించువాడవు, సమస్త జాతులచే చెప్పబడువాడవు. అన్ని జాతులలో జన్మించువాడవు. అందరి యొక్క మంచి చెడ్డలను తెలిసికొనువాడవు. ఎల్లపుడు మౌనముతో నుండువాడవు. అన్ని రంగులకు ఆతీతమైన బంగారు శాంతి గలవాడవు. అట్టి నీకు నమస్కారము.

**శ్లో॥ మంత్రవిగ్రహ మంత్ర సంగ్రహ మంత్రమాయజ సంహారా ।**
**మంత్రచేతన మంత్రనూతన మంత్రసంశయ శేఖరా ।**
**మంత్రరాజిత మంత్రపూజిత వేదవేద్య విశారదా ।**
**మంత్రబంధుర మంత్రనామక విశ్వకర్మ జగత్ప్రభో ॥ 4**

హే విశ్వకర్మ ప్రభూ!

నీవు మంత్రస్థాపిత విగ్రహ స్వరూపుడవు. సమస్త వేదమంత్రములలో రహస్యార్థముగా నున్నవాడవు. మంత్రముల మాయలో నున్నవారిని సంహరించువాడవు. మంత్రములలో జ్ఞాన స్వరూపుడవుగా నున్నవాడవు. మంత్రముల ద్వారా నూతన విషయములను తెలియ జేయుచున్నవాడవు. మంత్రములలోని సంశయములను తీర్చువాడవు. మంత్రవేత్తల చేత

పూజింప బడువాడవు. వేదముల చేత తెలిసికొనదగినవాడవు. శారదా రూపములో అనగా వాగ్రూపములో ప్రకాశించువాడవు. మంత్రవేత్తలకు బంధువైనవాడవు, మంత్రములలో ప్రసిద్ధమైన పేరు గలవాడవు. అగు విశ్వకర్మ జగత్ప్రభూ నీకు నమస్కారము.

**శ్లో॥ హార ఘోర విదార దూర శ్రవణ నిస్వన మంజులా ।**
**ధీరవార్ధి గభీర మాయామంద్రితాశ్రిత చిత్కళా ।**
**సూరిత్వష్టృవిహారకల్ప విచారకారణ సత్ఫలా ।**
**మేరు నిర్మిత మేరునామక విశ్వకర్మ జగత్ప్రభో ॥ 5**

జగత్ప్రభుడవగు ఓ విశ్వకర్మ పరమాత్మా!

నీవు అత్యంత ఘోరమైన పాపములను తొలగించి దూరముగా నుంచువాడవు. వినుటకు మనోహరమైన మధురధ్వనులను నిచ్చువాడవు. విశాలమైన సముద్రమువలె గంభీరమైనవాడవు. మాయాగ్రస్తుడై నిన్నాశ్రయించిన వారికి తెలుగుబాట చూపించువాడవు, త్వష్టృ బ్రహ్మ సృష్టి కల్పను విచారించుటకు కారణభూతుడవై సత్ఫలము నిచ్చువాడవు. దేవతలను నివాసమైన మేరు పర్వతమును నిర్మించినవాడవు. మేరు పర్వత నామము గలవాడవు. అట్టి నీకు నమస్కారము.

**శ్లో॥ విశ్వచారణ విశ్వపూరిత విశ్వధారణ నిశ్చయా ।**
**విశ్వభూషణ విశ్వతోరణ విశ్వపోషణ విస్మయా ।**
**విశ్వతారణ విశ్వకారణ విశ్వధారణ లీలయా ।**
**విశ్వహారణ విశ్వనామక విశ్వకర్మ జగత్ప్రభో ॥ 6**

హే విశ్వకర్మ జగత్రభూ !

నీవు విశ్వమందంటను సంచరించువాడవు, విశ్వమును పూరించువాడవు, విశ్వమును ధరించువాడవు, నిశ్చయ జ్ఞానము గలవాడవు,

విశ్వమునకు భూషణము వంటివాడవు, విశ్వమునకు మంగళకరుడవు, విశ్వమును పోషించువాడవు, ఆశ్చర్యమును కలిగించు వాడవు, విశ్వమునకు రక్షకుడైన వాడవు, విశ్వమునకు ఆధారభూతుడైన వాడవు, విలాస చేష్టలు గలవాడవు, విశ్వమును హరించువాడవు, విశ్వము అను పేరు గలవాడవు. అట్టి ఓ పరమేశ్వరా ! నీకు నమస్కారము.

**శ్లో॥ మంగళాకర మంగళాధర మంగళాసన పఞ్చకా ।**
**మంగళాస్థిత మంగళాప్రద మంగళాంగ విరాజితా ।**
**మంగళాయత భీషదాయక మంగళాకర నామకా ।**
**మంగళాజయ తుంగ నామక విశ్వకర్మ జగత్రభో ॥ 7**

హే విశ్వకర్మ జగత్రభూ !

నీవు శుభములకు ఆశ్రయమైన వాడవు, శుభముల నిచ్చి ఆదరించు వాడవు, మంగళములే ఆసనముగా గలవాడవు, సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష, ఈశాన అను పంచముఖములు గలవాడవు, సర్వదా మంగళముల నిచ్చుచు నుండువాడవు, మంగళవ్రతములు గలవాడవు, మంగళ స్వరూపుడవు, విశేషముగా ప్రకాశించు వాడవు, మంగళములకు స్థానమైనవాడవు, శత్రువులకు భీతిని గొల్పువాడవు, మంగళములకు స్థానమైన పేరు గలవాడవు, శుభములచే జయింపబడువాడవు. అత్యుత్తమైన పేరు గలవాడవు, అట్టి విశ్వకర్మ పరమేశ్వరా ! నీకు నమస్కారము.

**శ్లో॥ కల్పపావన కల్పజీవన కల్పభావ నమోస్తుతే ।**
**కల్పపాలన కల్పఖేలన కల్పజాజ్ఞ నమోస్తు తే ।**
**కల్పనాకృత కల్పసంయుత కల్పకల్ప నమోస్తు తే ।**
**కల్పతాండజ కల్పనామక విశ్వకర్మ జగత్ర్పభో ॥ 8**

హే విశ్వకర్మ ప్రభూ !

నీవు సృష్టిని పవిత్రము చేయువాడవు, సృష్టికి జీవనాధారమైన వాడవు, సృష్టి రూపములో తెలిసికొనదగిన వాడవు, అట్టి నీకు నమస్కారము. సృష్టిని పాలించువాడవు, సృష్టిలో విలాసముగా విహరించువాడవు, సృష్టి రహస్యములను తెలిసికొనుచున్నవాడవు, అట్టి నీకు నమస్కారము, సృష్టి అతీతముగా నుండువాడవు, సృష్టిలో అంతర్లీనమై యుండువాడవు అట్టి నీకు నమస్కారము. బ్రహ్మాండ రూపములో నుండువాడవు, బ్రహ్మాండ నామము గలవాడవు. అట్టి ఓ విశ్వకర్మ ప్రభూ మా నమోవాకములు అర్పించుచున్నాము మమ్ములను కాపాడుము.

ఆంధ్రానువాదము సమాప్తము.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

# శ్రీ విశ్వకర్మాది మూల పురుష స్మరణమ్

**"విమర్శకరత్న" కీ॥శే॥ స్వర్గ సుబ్రహ్మణ్యకవి పెదపాలెం భారతీయ మహాశిల్పము - గ్రంథకర్త : గుంటూరుజిల్లా.**

శ్రీ వాణ్యాశ్రిత పాదపద్మయుగళం, విద్యుత్ప్రభా భాసురం
గాయత్రీయుత మవ్యయం దశభుజం మేర్వగ్ర పీఠోజ్జ్వలం
దేవర్షిస్తుత పంచవక్త్రభవం మందస్మితాస్యం శివం
వందే శిల్పా సహస్ర మూలపురుషం శ్రీ విశ్వకర్మ ప్రభుమ్ ॥ 1

కేయూరైః కటకైర్విభూషితకరం హారావళీ సంయుతం
దివ్యద్రత్న కీరీటకుండలధరం పీతాంబరాలంకృతం
సృష్ట్యాదిత్రయ హేతుమూల వపుషం మేఘాధిరూఢోజ్జ్వలం
సర్వాభీష్ట వరప్రదాయక మహం వందే తమీశం సదా ॥ 2

పంచాస్యాం నవయౌవనాం దశభుజాం విద్యున్నిభాం సుందరీం
నానాశక్తి సముద్భవాత్మక తనుం వేదస్తుతం చిన్మయీం
గాయత్రీం కనకాంబరాం త్రినయనాం హంసాధిరూఢాం పరాం
సాష్టాంగైః ప్రణమామ్యహం నిఖిలదాం దేవి జగన్మాతరమ్ ॥ 3

**శ్రీ గాయత్రీ విశ్వకర్మాభ్యాం నమః**

సద్యోజాత ముఖాజ్జాతం శుద్ధస్ఫటిక సన్నిభం
ఆదిశక్తియుతం శాంతం ఋగ్వేదస్యా ధినాయకమ్ ॥
త్రికోణ కుండహోతారం కాలమేఘోపరి స్థితం
లోహ కృన్మూలపురుషం మనుం ధ్యాత్వార్చయామ్యహమ్ ॥ 4

**శ్రీమదాదిశక్తి మనుబ్రహ్మ స్వరూపాభ్యాం ఉమామహేశ్వరాభ్యాం నమః**

వామదేవ ముఖోద్భూతః మేఘవర్ణో మహాద్యుతిః
పరాశక్తి యుతోదేవో యజుర్వేదాభినాయకః
ధీమాన్ చతుష్కోణకుండ హోతానీలాభ్రవాహనః
దారు కృన్మూలపురుషః పాతు మాం సర్వదా మయః ॥ 5

**శ్రీమత్ పరాశక్తి మయబ్రహ్మ స్వరూపాభ్యాం లక్ష్మి నారాయణాభ్యాం నమః**

అఘోర ముఖ సంజాతం మహా మాణిక్య సన్నిభం
ఇచ్ఛాశక్తియుతం వృత్తకుండ హోతార మవ్యయం
సామ వేదాధిపం రక్త మేఘ వాహన సంస్థితం
తామ్ర కృన్మూలపురుషం త్వష్టారం పూజయామ్యహమ్ ॥ 6

**శ్రీమత్ ఇచ్ఛాశక్తి త్వష్టబ్రహ్మస్వరూపాభ్యాం వాణీహిరణ్యగర్భాభ్యాం నమః**

తత్పురుష ముఖాజ్జాతం శ్యామవర్ణం మహౌజసం
షట్కోణకుండ హోతారం క్రియాశక్తియుత ప్రభుం
అథర్వామ్నాయనేతారం శ్వేత మేఘోపరిస్థితం
శిలా కృన్మూలపురుషం శిల్పినం ప్రణమామ్యహమ్ ॥ 7

**శ్రీమత్ క్రియాశక్తి శిల్పిబ్రహ్మ స్వరూపాభ్యాం శచీపురందరాభ్యాం నమః**

ఈశాన ముఖసంజాతః తప్తకాంచన సన్నిభః
జ్ఞానశక్తియుతః పీత మేఘ పృష్ఠోపరిస్థితః
ప్రణవశ్రుతీశాష్టాస్ర కుండహోతా మహాతిః
స్వర కృన్మూలపురుషో విశ్వజ్ఞః పాతు మాం సదా ॥ 8

**శ్రీమత్ జ్ఞానశక్తి విశ్వజ్ఞ బ్రహ్మ స్వరూపాభ్యాం సంజ్ఞా భాస్వరాభ్యాం నమః**

బ్రహ్మేశానాచ్యుత గుణగణైః సంభవో యః పరాత్మా
కాలజ్ఞాన ప్రథిత వచనై ర్లోకచక్షుః ప్రదాతా

మాయాతీతః కులమతహరో ధర్మ సంరక్షకస్తం
వీరబ్రహ్మేంద్ర గురుచరణం నౌమిభక్త్యా సదాహమ్ ॥ 9

**శ్రీ గోవిందా సమేత వీరబ్రహ్మేంద్రస్వామినే నమః**

ఈ పాలకొండ పురభాసిత భానుబింబం
సింహాద్రి వంశ భవ మాది విరాట్ స్వరూపం
సర్వార్థదాయక మహం ప్రణమామి భక్త్యా ॥ 10

**శ్రీ అన్నపూర్ణ సహిత సనారీ విశ్వేశ్వర విశ్వనాథావదూతాయ నమః**

నీలాభం రక్తవస్త్రం భ్రుకటియుతముఖం జ్వాలాకేశం త్రినేత్రం ।
సద్వేవఖడ్గంచ దండం త్రిశిఖర పరశుం వామభాగే కపాళమ్ ।
ఖేటం ఘంటాం వహస్తం ముసలమపి దధత్కింకిణీ మాలయాఢ్యం ।
సింహత్వ గ్భద్ధ స్ఫురత్మమ పురో వీరభద్రం నమామ్యహమ్ ॥ 11

**శ్రీ భద్రకాళీ సమేత వీరభద్ర స్వామినే నమః**

శ్రీ స్వర్ణవంశ కలశోదధి పూర్ణచంద్రో,
అష్టాంగయోగ మహిమ తిశ యాభిరామః
సాక్షాన్మహేశ్వరభవో మర లింగనామ,
మాంమత్పితామహ నమః కృపయా స పాయాత్ ॥ 12

**శ్రీ స్వర్ణ అమరలింగస్వామినే నమః**

# ఇష్టదేవతాది ప్రార్థన

1. శ్రీ గాయత్రీం పరాశక్తిం ప్రణవైక స్వరూపిణీం
మాతృదేవీం శ్రియం వందే బ్రహ్మకర్మ స్వరూపిణీం ॥
2. తత్త్వార్థవర్ణ చిద్రూపాం జ్ఞానవిద్యా ప్రదాయినీం
సవిత్రీం జగదాధారాం సావిత్రీంత్వాము పాస్మహే ॥
3. దాతారం జ్ఞానదాతారం త్రాతారం కర్మసాక్షిణం
జగత్స్రష్టారమీడేహం విశ్వకర్మ ఫలప్రదం ॥
4. ప్రపంచ ఘటనామూలం పంచకర్మ ప్రకాశితం
విశ్వమూర్త్యాత్మికం విష్ణుం విశ్వకర్మాణ మాశ్రయే ॥
5. ప్రపంచ కావ్యవైచిత్ర్య కల్పనా శిల్పకారకౌ
విశ్వమంగళదాతారౌ విశ్వకర్మ స్వరూపిణౌ ॥
6. గాయత్రీ విశ్వకర్మాణౌ వాగర్ధ శ్రీ విరాజితౌ
జగతః పితరౌ ధ్యాయే శబ్దార్థ జ్ఞానసిద్ధయే ॥
7. విశ్వకార్యాగ్రపూజ్యాయ, విశ్వ ప్రత్యూహ శాన్తయే
విశ్వవిఘ్నాహితార్క్ష్యాయ గణానాం పతయే నమః ॥
8. ప్రారబ్ధ కర్మ నిశ్శేష నిరంతరాయ సిద్ధయే
విఘ్నాన్ధత మసార్కాయ భూతానాం పతయే నమః ॥
9. పిత్రోశ్చరణ రాజీవం సాహస్రమభివాదయే
ఏవం సంసార రంగేస్మిన్ యత్ప్రసాదేన నర్తకః ॥
10. మాతాపితృపదాంభోజం భవతాండవ కారకం
భవరంగస మభ్యర్చ్యం భజేహం భవతారకం ॥

**సన్నుతి రత్నమాల గ్రంథం లోనిది**

# ఆదిమ దంపతీ స్తోత్ర మంజరి

## కీ॥శే॥ పండిత చామర్తి అమరేశ్వరశర్మ గారు, హైదరాబాద్

**ఓం విశ్వకర్మాదిశాం పతిస్సనఃపశూన్ పాతు, సోऽస్మాన్పాతు తస్మైనమః**

**శ్లో॥ శ్రీమద్భూజ చరాచరాననపరం భక్తౌఘ ముక్తిప్రదం**
**హృత్పద్మస్థిత మాద్య మవ్యయ పదం భక్తావనోత్సాహీనం**
**పంచాస్యం జగదాలయం సురగురుం సంసేవ్య పాదాంబుజం**
**వందేऽహం భవపాశమోచనకరం శ్రీ విశ్వకర్మప్రభుం.**

**భావం:** శుభప్రదమైన భుమి నుండి పుట్టిన చరాచర జీవులను కాపాడువాడు, పాపాలు తొలగించి ముక్తిని కలిగించువాడు, హృదయమనెడి పద్మము నందున్నవాడు, సృష్టికి ఆద్యుడై నాశనము లేనట్టి స్థానమందుండువాడు, విధేయులైన భక్తులను ఉత్సాహపరచునట్టివాడు, ఐదుముఖాలు గలవాడు, ప్రపంచమే నివాసమైనవాడు, నిత్యం దేవేంద్రునిచే పూజించబడు పాద పద్మములు గలవాడు, పాపపాశము నుండి విముక్తులను చేయువాడు, దేవగురువు అయిన విశ్వకర్మ ప్రభువుకు నేను నమస్కరిస్తున్నాను.

# రూప ధ్యానం

**శ్లో॥ ప్రపంచ ఘటనామూలం పంచకర్మ ప్రకాశితం**
**పంచమూర్త్యాత్మికం దేవం విశ్వకర్మాణ మూతయే**
**పంచాననో దశభుజో వ్రతబంధ దీక్షః**
**కేయూర హార మణికుండల చండతేజాః 1**

**భావం :** ప్రపంచ నిర్మాణమునకు ముఖ్యకారణమైనవాడు, పంచవృత్తులతో ప్రకాశించు ఐదురూపాలకు ఆత్మయైనవాడు, ప్రపంచ నిర్మాణమే తన

రూపమైనవాడు, ఐదు ముఖాలు, పదిభుజాలు గలవాడు, వ్రతములో దీక్ష స్వీకరించిన వాడు, కేయూరములు, హారములు, మణులు, చెవికమ్మలతో తీవ్రమైన తేజస్సుగల దేవునికి నమస్కరిస్తున్నాను.

**శ్లో॥ భస్మాంకితో మణిమయాసన సంస్థితోఽసౌ**
**విశ్వేశ్వరో వసతు, మే, హృది, విశ్వకర్మా 2**

**భావం :** నుదుట విభూతి గలవాడు, మణులు, మాణిక్యాలు పొదిగిన ఆసనముపై కూర్చున్న లోకాలకు నాయకుడైన ఈ విశ్వకర్మ నా హృదయమందు నివసించుగాక.

**శ్లో॥ పంచవక్త్రం జటాధారం దశపంచ విలోచనం**
**సద్యోజాతాననం శ్వేతం వామదేవంతు కృష్ణకం 3**

**భావం:** ఐదు ముఖములతోను, జడలు ధరించిన వాడును, పదిహేను కళ్ళతోనున్నవాడును, తెలుపు వర్ణము గల సద్యోజాత ముఖుడున్ను, కృష్ణ వర్ణము గల వామదేవ ముఖము గలవాడున్ను,

**శ్లో॥ అఘోరం రక్తవర్ణంచ పీతం తత్పురుషం తథా**
**ఈశానం శ్యామవర్ణంతు శరీరం హేవర్ణకం 4**

**భావం :** ఎరుపు వర్ణము గల, అఘోరమనెడి ముఖము గలవాడు, పీత వర్ణము గల తత్పురుష ముఖము గలవాడు, శ్యామ వర్ణము గల ఈశాన ముఖము గలవాడు, బంగారు వన్నెగల శరీరంతో ప్రకాశించుచున్న వాడున్ను,

**శ్లో॥ దశబాహుం మహాకాయం హేమకుండల భూషితం**
**నక్షత్రమాలాభరణం స్వర్ణయజ్ఞోప వీతినం 5**

**భావం :** పదిచేతులతో పెద్ద శరీరం గలవాడు, బంగారు కమ్మలతో, నక్షత్రములతో అలంకరించబడినవాడు, బంగారు యజ్ఞోపవీతం ధరించినవాడున్నూ...

**శ్లో॥ చిత్రాంబరధరం దేవం చిత్రవర్ణోత్తరీయకం**
**శూలం డమరుకం చైవ శంఖం చక్రంచ పుస్తకం 6**

**భావం :** చిత్ర విచిత్ర వస్త్రములను ధరించినవాడు, చిత్రవర్ణములు గల ఉత్తరీయం గలవాడు, శూలము-ఢమరుకం-శంఖం-చక్రం-పుస్తకములను ధరించిన దేవదేవునికి నమస్కరిస్తున్నాను.

**శ్లో॥ లేఖినీ మక్షమాలాంచ గదాహి శర కార్ముకౌ**
**కోటిసూర్య ప్రతీకాశం దశహస్తై ర్విభూషితం 7**

**భావం:** ఘంటము-జపమాల-గద-బాణం సంధించిన ధనుస్సును పదిచేతులతో అలంకరించబడినవాడును, కోటిసూర్యులతో సమానంగా ప్రకాశించు దేవదేవునికి నమస్కరిస్తున్నాను.

**శ్లో॥ జీమూతవాహనారూఢం హనుమద్ధ్వజ సంయుతం**
**సర్వభూత గణాధ్యక్షం సత్యం శాంతం దయానిధిం 8**

**భావం:** గరుత్మంతుడే వాహనముగా గలవాడు, హనుమంతుడే జెండా గుర్తుగా గలిగినవాడు, సమస్త భూతగణములకు నాయకుడైనవాడు సత్యరూపం, శాంత రూపం, దయానిధియైనవాడు.

**శ్లో॥ ప్రణవమయ పీఠస్థ గాయత్రీ ప్రాణవల్లభం**
**పంచర్షి సానగాద్యైశ్చ సంయుక్తం ప్రణమామ్యహం 9**

**భావం:** ఓంకార పీఠమునందున్న గాయత్రీమాత యొక్క ప్రాణపతి యైనవాడు, సానగ ఋషి-సనాతన ఋషి-అహభూన ఋషి-ప్రత్నస ఋషి-సుపర్ణ ఋషి అనెడి ఐదుగురు ఋషులతో కూడిన ఆ దేవునికి నేను నమస్కరిస్తున్నాను.

**శ్లో॥ విశ్వకర్మన్ మహాదేవ దేవదేవ మహావిభో**
**విశ్వేశ, విశ్వకర్మేశ విశ్వకర్మ న్నమోస్తుతే 10**

**భావం :** ఓ విశ్వకర్మ! మహాదేవ! దేవతలకే ఆరాధ్యుడైన ఓ మహాప్రభు! విశ్వనాయక! ప్రపంచ కర్మలకు అధిపతి! విశ్వకర్మదేవ ! నీకు నమస్సులు.

**శ్లో॥ త్వమేవ సర్వలోకానా మీశ్వరః ప్రభురేవచ**
**త్వమేవ జనకస్సాక్షా ద్భూతానాం వేదసత్తమః 11**

**భావం :** నీవే సమస్త లోకములకు నాయకుడవు, రాజువు కూడ, నీవే సాక్షాత్తు తండ్రివి, సమస్త జీవులకు, సమస్త భూతములలో వేదవేత్తవు నీవేకదా!

**శ్లో॥ సృష్టి సంహార కారకో లోకానాం సర్వకామదః**
**విశ్వకర్మా పరబ్రహ్మ విశ్వకర్మా హరో, హరిః 12**

**భావం:** సృష్టి వినాశనమునకు కారణమైనవాడవు, అన్ని లోకాలలో అందరి కోరికలను తీర్చువాడవు, శివకేశవ రూపమైనట్టియు, పరబ్రహ్మవైనట్టియు ఓ విశ్వకర్మా! నీకు మా నమస్సులు.

**శ్లో॥ మన్వాది బ్రహ్మరూపాయ సర్వప్రాకృత మూర్తయే**
**శిల్పాచార్యాయ దేవాయ నమస్తే విశ్వకర్మణే 13**

**భావం:** మను–మయ–త్వష్ట–శిల్పి–దైవజ్ఞ అనెడి పంచబ్రహ్మల రూపమైన వాడవు, సమస్త ప్రకృతియే తన రూపమైన వాడును, శిల్పాచార్య స్వరూపుడు. దేవుడైనట్టి విశ్వకర్మకు నా నమస్సులు.

**శ్లో॥ మయాయ మనవే త్వష్ట్రే, దైవజ్ఞాయచ శిల్పినే**
**సర్వజీవ ప్రకాశాయ నమస్తే విశ్వకర్మణే 14**

**భావం :** మను మయాది పంచబ్రహ్మలకు ఆత్మయైన, సర్వజీవులను ప్రకాశింప జేయునట్టి ఆ విశ్వకర్మ దేవునకు మా నమస్సులు.

**శ్లో॥ ఓం నమః పరమార్థాయ పురుషాయ మహాత్మనే**
**శుద్ధసత్వ స్వరూపాయ మాయినే విశ్వకర్మణే 15**

**భావం :** ఓంకార స్వరూపుడైన, పరతత్త్వ జ్ఞానియైన పురుషాకారుడైన వాడు, మహాత్ముడైన వాడు, పరిశుద్ధ సత్త్వసంపన్నుడైనవాడు, మాయా రూపుడైన వాడైన విశ్వకర్మ ప్రభువునకు మా నమస్సులు.

**శ్లో॥ వశం తంతుమయం శిక్యం శిక్యే బ్రహ్మాండ మద్భుతం**
**నిహితంచో భయం యేన, విశ్వకర్మా సపాతునః 16**

**భావం:** దారములతో చేసిన పెద్ద ఉట్టిలో అద్భుతమైన ఈ బ్రహ్మాండ మంతయును బంధించి తన వశము చేసుకొన్నవాడు, చీకటి వెలుగులును ఎవరిచేత దాచబడినవో అట్టి విశ్వకర్మ భగవానుడు మనలను రక్షించునుగాక.

**శ్లో॥ దివి భువ్యుదరే కాష్ట పాషాణాదౌచ యేవిభుః**
**చతుర్ద్రావ్య భజజ్జ్యోతి శ్చతుర్విధ ఫలాప్తయే 17**

**భావం:** భూమి, ఆకాశమును పొట్టలో కలిగినవాడు, కట్టె, రాళ్ళయందును కూడ ఏ ప్రభువు కలడో, పత్రం, పుష్పం, ఫలం, జలం అను చతుర్ద్రవ్యము లను పొందుచున్నాడో, ధర్మ, అర్థ, కామ, మోక్షములనెడి చతుర్విధ పురుషార్థ ఫలములను సాధించుటకు జ్యోతిరూపుడైన ఆ విశ్వవిభుడు మనలను రక్షించుగాక.

**శ్లో॥ వాతరజ్జ్వా ధృతం దివ్యం జ్యోతిః కాలస్య కారణం**
**బిభ్రమీ త్వనిశం యేన ప్రవర్తంతే క్రతుక్రియాః 18**

**భావం :** వాయువను త్రాడును ధరించినవాడు, దివ్యమైన కాంతివంతమైన తేజోరూపుడు, కాలమునకు కారణమైనవాడు, నిత్యము ఎవరిచేత యజ్ఞ యాగాలు ప్రవర్తించబడుచూ, ధరింపబడుచున్నవో అట్టి దేవుడు మనలను రక్షించుగాక.

**శ్లో॥ యో వైశ్వానరో వహ్నిః ప్రాణినాం దేహమాశ్రితః**
**చతుర్విధం పచత్యన్నం తదుదర్యం మహత్స్మృతం 19**

**భావం :** ఎవరు యజ్ఞసంబంధ పవిత్రాగ్నియో, సమస్త దేహములలో ప్రాణరూపమై యున్నవాడో, చతుర్విధముల ఆహారమును పచనము చేయుచున్నాడో, ఎవరి ఉదరము చాలా గొప్పదని చెప్పబడుచున్నదో అట్టి దేవుడు మనలను రక్షించుగాక.

**శ్లో॥ దృఢా ఘృతేన కాష్టాదే ర్యత్తేజో జాయతే మహత్**
**జ్వలనోనామ తల్లోకే శ్రౌతం స్మార్తం హవిఃపచేత్ 20**

**భావం :** కట్టెలు ఒకదాని కొకటి బాగా సంఘర్షణ చేయడం చేత పుట్టిన పవిత్రమైన అగ్నివలన గొప్ప తేజస్సు కల్గుచున్నది. దానితో ఈ లోకంలో నిత్య, నైమిత్తిక, యజ్ఞయాగాది కర్మలలో హవిస్సు పచనము చేయబడుచున్నది.

**శ్లో॥ యఃకాలం దక్షిణాంచైవ యజమానం హవీంషిచ**
**ధారయన్యః పరశివో విశ్వకర్మా సపాతునః 21**

**భావం :** ఎవడు దక్షిణ దిక్కునుండు యముని రూపములో నున్నాడో, యజ్ఞ సంబంధ హవిస్సులను ధరించుచున్నాడో, విశిష్టమైన మంగళ రూపము ధరించువాడో అట్టి విశ్వశిల్పి మనలను రక్షించుగాక.

**శ్లో॥ నయత్యనేక రసతాం మధురైక రసంజలం**
**యస్తత్తద్బీజ యోగేన మహాశిల్పీ సపాతునః 22**

**భావం :** లోకంలో ఎన్ని రకాల బీజముల వలన మధురములైన రస జలములు అనేక రూపములలో లభించుచున్నవో అట్టి సృష్టి చేసిన మహాశిల్పియైన ఆ భగవానుడు మమ్ము రక్షించుగాక.

**శ్లో॥ భౌమాన్యనేక రూపాణి యస్యశిల్పాని మానవాః**
**ఉపజీవంతి తం విశ్వం విశ్వకర్మాణ మీమహి 23**

**భావం :** ఎవని యొక్క శిల్పములు, భూమి, నీరు మొదలగు రూపములో, అతని అనేక విధములైన శిల్పములు మానవులుగా పుట్టి జీవించుచున్నారో అట్టి విశ్వనిర్మాతకు, విశ్వకర్మకు నేను నమస్కరిస్తున్నాను.

**శ్లో॥ దిక్కాలై స్సూర్య చంద్రాభ్యాం గో విప్రాభ్యాం హవిర్మనూన్**
**నిర్మాయ నిర్మమే యజ్ఞం తస్మై యజ్ఞాత్మనే నమః 24**

**భావం :** అష్టదిక్కులు, త్రికాలములు, సూర్యచంద్రులు, గోవులు, బ్రాహ్మణులు, హవిస్సును, మానవులను సృజించినవాడును, యజ్ఞయాగములను నిర్వహించిన వాడును, యజ్ఞమునకు ఆత్మయైన ఆ భగవానునకు నా నమస్సులు.

**శ్లో॥ దివి భు వ్యంతరిక్షేవా, పాతాలేవాపి సర్వశః**
**యత్కించి చ్ఛిల్పినాం శిల్పం తత్ప్రవర్తకతే నమః 25**

**భావం :** స్వర్గము, భూమి, ఆకాశము, పాతాళములలోగాని అన్నిచోట్ల చిన్నచిన్న నిర్మాణములు సైతము విశ్వకర్మ కృతములే. అట్టి శిల్పనిర్మాతయైన విశ్వబ్రహ్మకు నా నమస్కారములను తెలియజేయుచున్నాను.

**శ్లో॥ విశ్వవిద్యా స్వరూపాయ విశ్వమంగళ కారిణే**
**విశ్వసంసార బీజాయ నమస్తే విశ్వకర్మణే 26**

**భావం :** ప్రపంచ విద్యయే స్వరూపమైనవాడు, ప్రపంచమునకు శుభం కలిగించువాడు, ప్రపంచమనెడి సంసారమునకు బీజమైనవాడు అగు శ్రీ విశ్వకర్మదేవునకు నా నమస్సులు.

**శ్లో॥ విశ్వాయ విశ్వరూపాయ నమస్తే విశ్వమూర్తయే**
**మాతా పితృ స్వరూపాయ నమోస్తు విశ్వకర్మణే 27**

**భావం :** విశ్వమందు వ్యాపించినవాడు, ప్రపంచమే ఆకారంగా గలవాడు, ప్రపంచమే తన రూపంగా గలవాడు, తల్లిదండ్రుల స్వరూపమైనవాడు ఆ విశ్వకర్మ దేవునకు నా నమస్సులు.

**శ్లో॥ నమో హిరణ్యగర్భాయ నమో నారాయణాయచ**
**నమశ్శ్రీ నీలకంఠాయ నమశ్శ్రీ విశ్వకర్మణే 28**

**భావం :** హిరణ్య గర్భ స్వరూపుడు, నారాయణ స్వరూపుడు, నీలకంఠ స్వరూపుడు, శుభకరుడైన శ్రీ విశ్వకర్మ దేవునకు మా నమస్సులు.

**శ్లో॥ యోదేవ స్సవితాஉస్మాకం ధియో ధర్మాధిగోచరాః**
**ప్రేరయే త్తస్యయ ద్భర్గ స్తద్వరేణ్య ముపాస్మహే 29**

**భావం:** ఏ దేవుడు మాకు సూర్యుడో, ధర్మార్థములను తెలుసుకొను బుద్ధి నొసగిన వాడో, తేజోరూపుడైన ప్రేరకుడెవరో, వరములను ఇచ్చునట్టి శ్రేష్ఠమైన వాడెవరో అట్టి దేవుని ఉపాసించుచున్నాను.

**శ్లో॥ సత్యం భజే తృపది గచ్ఛతి కామ్యసిద్ధిః**
**శ్రీ విశ్వకర్మ పదరాజ ముపైతిమర్త్యః 30**

**భావం:** శుద్ధమైన మనస్సుతో సేవించినట్లైతే, వారి కోరికలను తీర్చుచున్న శ్రీ విశ్వకర్మ భగవానుని పాదముల చెంతకు చేరవచ్చును.

# గాయత్రీ స్తుతిః

**శ్లో॥ ముక్తా విద్రుమ హేమ నీల ధవళ చ్ఛాయై ర్ముఖై రుజ్వలాం**
**యుక్తా మిందు నిబద్ధరత్న మకుటాం తత్త్వార్థ వర్ణాత్మికాం**
**గాయత్రీం వరదాభయాంకుశ కశా శ్శుభ్రం కపాలం గదాం**
**శంఖం చక్ర మదారవింద యుగళం హస్తై ర్వహంతీం భజే.**

**భావం:** ముత్యములు, ప్రవాళములు, సువర్ణం, నీలములు, వజ్రముల వర్ణములతో కూడిన కిరణములతో ప్రకాశించుచున్నట్టియు, చంద్రకాంత మణులు, రత్నములతో పొదగిన కిరీటం గల, ఓంకార స్వరూపిణియు, కోర్కెలు తీర్చి అభయము నిచ్చు నట్టియు చేతులలో దర్భలు, కొరడా,

కపాలం, గదను, శంఖము, చక్రమును మరియు రెండు చేతులలో పద్మములను ధరించుచున్న గాయత్రీ మాతను సేవించుచున్నాను.

**శ్లో॥ గాయత్రీ విశ్వకర్మాణౌ, విశ్వస్యాదిమ దంపతీ**
**జగతః పితరౌ వందే విశ్వమంగళదాయకౌ**

**భావం :** ప్రపంచానికే ఆదిదంపతులైనట్టియు, సమస్త లోకాలకు తల్లి దండ్రులై శుభములు కలిగించునట్టి గాయత్రీదేవి, విశ్వకర్మ భగవానులకు నమస్కరించుచున్నాను.

**శ్లో॥ నిత్యం స్మరేజ్జగతి పాపమపా కరోతి**
**స్తుత్యం పఠేత్ స్తవమయం సుఖమాతనో తి**

**భావం :** ఈ లోకంలో ఆ గాయత్రీమాతను నిత్యం స్మరించినచో పాపుల పాపము తొలగిపోవును. స్తోత్రములను నిత్యం చదివిన వారికి సుఖ సౌఖ్యములు కలుగును.

# గాయత్రీ మంత్రం

**ఓం భూర్భువః స్వః తత్సవితు ర్వరేణ్యం**
**భర్గో దేవస్య ధీమహి, ధియో యోనః ప్రచోదయాత్**

ప్రాణపవిత్రతను, ఆనందము నొసంగు నో ప్రభువా! నీవు సర్వజ్ఞుడవును, సకల జగదుత్పాదకుడవును నైయున్నావు. మేము నీయా పూజనీయతమైనట్టియు, పాప వినాశకమైనట్టియు, విజ్ఞాన స్వరూప తేజమును ధ్యానించుచున్నాము. ఆ తేజమే మా బుద్ధులను ప్రకాశింప జేయుచున్నది. ఓ తండ్రీ! మాబుద్ధి నీ నుండి కదాపి విముఖమై యుండుగాక. నీవు మా బుద్ధులందు సదా ప్రకాశితుడవైయుండి, మా బుద్ధులను సత్కర్మలందు ప్రేరేపించుచుందువుగాక.

# పంచ ఋషిస్తోత్రం

**శ్లో॥ కారుణ్యామృత పూరపూరిత మనాః కైలాస పాంచననో**
**దుర్జన్మాద్యఖిలాఘ భేద సమరో ల్లీఢోల్ల సత్ఫుల్ల హృత్**
**పాపోద్భూత భయగ్రహక్షణన ధీరోద్యత్ప్రఫుల్లానన**
**స్సద్యోజాత మహేశ సానగ ఋషిః పాయా త్సదాస్మాన్ పరమ్ 1**

**భావం :** దయామృత ప్రవాహముతో నిండిన మనస్సు గలిగినవాడు, కైలాస పర్వతమున సింహము వంటివాడు, ఎన్నో దుష్ట జన్మలలో చేసిన సమస్త పాపములను ఛేదించుటనబడు యుద్ధంలో గెలుచుటచే సంతోషంతో వికసించిన హృదయము గలవాడు, పాపముల నుండి పుట్టిన భయంచేత పీడింపబడు వారిని రక్షించుటచే ధైర్యగుణంతో వికసించిన ముఖము గల సద్యోజాతముఖుడైన మహేశ్వర రూపుడగు సానగ ఋషి ఎల్లప్పుడు మమ్ములను మిక్కిలి రక్షించుగాక.

**శ్లో॥ శ్రీమత్కామితదాయక స్సురగణ్ణి సంసేవ్య పాదాంబుజ**
**స్సద్బృందావన తత్పరః పరదయా యుక్త స్సదాసన్నిధి**
**శ్చావాచ్యాస్య సముద్భవ స్సతు పరాశక్త్యాయుతః కేశవ**
**స్త్రైలోక్యాధిపతి స్సనాతన ఋషిః పాయా త్సదాస్మాన్ పరమ్ 2**

**భావం :** శుభకరుడు, కోరిన కోర్కెలు దీర్చునట్టివాడు, సమస్త దేవగణములచే ఆరాధించబడు పాదములు గలవాడు, సజ్జనులను కాపాడువాడు, దుర్జనులపై కూడా దయజూపుచు వెన్నంటి కాపాడునట్టివాడు, శివుని దక్షిణ ముఖము నుండి పుట్టిన వామదేవరూపుడు, పరాశక్తితో కూడినట్టివాడు, కేశవ రూపుడైన వాడు, త్రిలోకాధిపతి యునైన సనాతన ఋషి ఎల్లప్పుడు మమ్ములను మిక్కిలి రక్షించుగాక.

**శ్లో॥ ధూతాశేష విపత్పరంపర మహాభక్తౌఘ హృద్వాస కృ**
**ద్వైరాట్పశ్చిమ దిఙ్ముఖోద్భవ గురు సృష్ట్యాది కర్తృత్వ భృ**
**ద్విశ్వాధిక్య మహోగ్రతాపస ఫలప్రాధాన్య ధాతా విభు**
**ర్విద్యావీర్య మహాహభూన ఋషిరా ట్పాయా త్సదా స్మాన్పరమ్ 3**

**భావం :** జనుల యొక్క సమస్త ఆపదలను తొలగించి మహాభక్తుల హృదయాలలో నివాసముండువాడు, విరాట్ యొక్క పశ్చిమ దిక్కు ముఖము నుండి పుట్టిన గురువై అఘోరగ రూపుడై సృష్టిస్థితి లయములను చేయువాడు, ప్రపంచ ఆధిపత్యమునకై మహాతపస్సులు చేయు తాపసులకు ఫలములనిచ్చువాడు, విద్యాపరాక్రమవంతుడు, మహిమాన్వితుడైన అహభూన ఋషి సదా మమ్ములను మిక్కిలిగా రక్షించుగాక.

**శ్లో॥ ధీరోదార మహాగ్రగణ్య సుర సమ్మోదాక రోద్యత్ప్రభు**
**ర్వీరో భూరి పరాక్ర మాక్రమిత షడ్వర్గారి జిత్ప్రాణదః**
**వైరాడుత్తర దిఙ్ముఖోద్భవ మహాతేజాశ్చ సత్సన్నిధి**
**స్తత్వార్థాధి గతోహి ప్రత్నఋషిరా ట్పాయాత్సదాస్మాన్ పరమ్ 4**

**భావం :** ధైర్యవంతులు, ఉదారవంతులలో అగ్రగణ్యుడును, దేవతలకు అత్యంతానందం కలిగించిన వాడును, గొప్పవీరుడు, గొప్ప పరాక్రమము చేత కామాది శత్రువర్గమును జయించినవాడు, ప్రాణములు రక్షించువాడు, విరాట్ పురుషుని ఉత్తర దిక్కు ముఖము నుండి పుట్టిన తత్పురుష రూపుడును, మహాతేజోవంతుడు, సజ్జనుల పెన్నిధియైనవాడు వేదాంతార్థము నెరిగిన వాడైన ప్రత్నస ఋషి ఎల్లప్పుడు మమ్ములను రక్షించుగాక.

**శ్లో॥ శ్రీమత్పూర్వ ముఖోజ్జ్వల స్సమధికో లోకాదిమూర్తిర్విభు**
**స్తస్యోర్ధ్వానన జాతవేదమయ సద్రూపోజ్జ్వలైకాకృతి**

**ర్మోదాధార మహానిధి స్సురవర స్సద్భక్త సమ్మోద కృత్**

**దైవజ్ఞః పరమస్సుపర్ణ ఋషిరా ట్పాయా త్సదాస్మాన్ పరమ్ 5**

**భావం :** మంగళకరుడును, ఐదుముఖముల నుండి వచ్చు కాంతులతో మిక్కిలి ప్రకాశించువాడును, పరమేశ్వరుని ఊర్ధ్వముఖము నుండి పుట్టిన ఈశాన రూపుడు, అన్నిలోకాలకు ఆదిరూపమైన వేదవిభుడు, వేద స్వరూపుడైన మంచి రూపముతో కాంతివంతమైన ఆకారము గలవాడు, సంతోషానికి ఆధారమైనవాడు, మహానిధియైన వాడు, దేవతాశ్రేష్ఠుడు, మంచి భక్తులకు ఆనందాన్ని కలిగించువాడు, దైవస్వరూపుడైన వాడు, పరమశ్రేష్ఠుడైన సుపర్ణ ఋషిరాట్ ఎల్లప్పుడు మమ్ములను బాగా కాపాడుగాక.

# శ్రీ విశ్వకర్మాష్టకమ్

**రచన : "కళాప్రపూర్ణ" "దర్శనాచార్య" కీ॥శే॥ కొండూరు వీరరాఘవాచార్యులు**

**శ్లో॥ విశ్వ విశ్వ వినోద హేతు మహేతు మీశ్వర మద్వయం**
**విశ్వరూప మరూప మాద్య మనీశ్వరం సరమం షదం**
**విశ్వ సృష్టి మసృష్ట మేక మనేక మద్భుత దర్శనం**
**విశ్వకర్మ పరాత్పరం జగదాది మవ్యయ మాశ్రయే. 1**

**తా.** ఈయనంత విశ్వముల వినోదములకు హేతువైన వాఁడయ్యును తాను ఏ హేతువును లేక యుండువాఁడును, ఈశ్వరుఁడును; తనకంటె నితరము లేనివాడును, నానావిధ జంగమ స్థావరములతో నిండిన విశ్వమే రూపముగాఁ గలవాఁడును, పరమార్థదృష్టి ననుసరించి చూచిన ఏరూపమును లేనివాడును, మొదటి వాఁడును, తన్ను శాసించు నొండొక ఈశ్వరుడు లేనివాడును, సర్వజీవులకును పొందఁదగిన పరమ పదమును, విశ్వముల యొక్క సృష్టిగల వాఁడును, తానెవ్వరిచేతను సృష్టింపబడనివాఁడును, ఒక్కఁడును, ఉపాధి భేదమునుబట్టి, వ్యష్టి దృష్టి ననుసరించి చూచిన అనేక కారుఁడును, కావుననే యాశ్చర్యకరమగు దర్శనము గలవాఁడును, జగత్తులకు ఆదియు, అవ్యయుఁడును నగు విశ్వకర్మ పరాత్పరు నాశ్రయించుచున్నాను.

**శ్లో॥ జాగ్రదాది సమస్త సాక్షిణ మీక్షితార మలక్షణమ్**
**నిర్వికల్ప సమాధి గోచరనిత్య చిత్సుఖ రూపకమ్**
**భూతభావన మద్వితీయ మఖండ మేకరసం కవిమ్**
**విశ్వకర్మవిభుం జగద్గురు మాశ్రయే కరుణాలయమ్ 2**

**తా.** జాగ్రత్తు స్వప్నము సుషుప్తి అను నన్ని యవస్థలకును సాక్షియు,

నిఖిలప్రాణి హృదయములందుండి యన్నింటిని బరికించువాఁడును, ఏవిధమైన లక్షణమునకును లోనుగానివాఁడును, నిర్వికల్ప సమాధి యందుఁదోఁచు సచ్చిదానందమే (సత్తు చిత్తు ఆనందము) స్వరూపముగా గలవాడును, సర్వప్రాణులను బ్రేరేపించువాడును, తనకంటే రెండవ సర్వశక్తుఁడు లేనివాఁడును, ఖండము కాని వాఁడును, రసైక స్వరూపుడును, సర్వము నెఱింగిన వాఁడును, జగత్తులకెల్ల గురుఁడును, కరుణ కునికి పట్టయిన వాఁడను నగు విశ్వకర్మ విభు నాశ్రయించుచున్నాను,

**శ్లో॥ దేవ దేవ మదేవ మీడ్య మంచిత్యశక్తి మనన్తకమ్**
**జన్మమృత్యు జరాదిభావ వికారదూర మదూరగం**
**సర్వభూత హృదాలయస్థిత సాక్షిణం పరమేశ్వరం**
**విశ్వకర్మ విభుం జగద్గురు మాశ్రయే హృదయాలయే. 3**

**తా.** ఇంద్రాది దేవతలకును నారాధింపఁదగిన దేవుఁడును, తన కింకొక దేవుఁడు లేనివాడును, స్తుతింపఁదగినవాఁడును, విచారింప నలవికాని శక్తి కలవాఁడును, అంతములేనివాఁడును, పుట్టుక, చావు, ముదిమి (కొంతకాలముండుట పెరుగుట తరుగుట) మొదలగు నాఱు వికారములు లేనివాఁడును, జిజ్ఞాసువులకు జ్ఞానులకు దూరమున లేనివాడును ఎల్లప్రాణుల హృదయాలయములందును సాక్షియైయున్న వాఁడును, పరమేశ్వరుఁడను, జగద్గురుఁడుననగు విశ్వకర్మ విభుని హృదయమును నాలయములో సేవింతును.

**శ్లో॥ భేద వర్జిత మప్రమేయ మసంగ మద్భుత మక్షయమ్**
**నిష్కలం నిరవద్య మాద్య మనంతశక్తి మజం విభుమ్**
**నిస్తులం నిగమాంత వేద్య మనీశ్వరం సకలేశ్వరం**
**విశ్వకర్మ పరాత్పరం హృది భావయామి నిరంతరం. 4**

**తా.** సజాతీయము విజాతీయము స్వగతమునను మూడు భేదములులేని వాఁడును, ప్రత్యక్షాది ప్రమాణములకు గోచరింపనివాఁడును, శరీరేంద్రియ సంఘాతముతోడి సంగములేనివాఁడును, అద్భుతుఁడును, నాశరహితుఁడును, నిష్కళుడును, ఏ దోషములు లేనివాఁడును, ఆద్యుఁడును, అంతులేని శక్తిగలవాఁడును, పుట్టుక లేనివాఁడును, సర్వవ్యాపియు, సాటిలేనివాఁడును, వేదాన్తములగు నుపనిషత్తులచే నెఱుంగ దగినవాఁడును, తనకు పైనధిపతి లేనివాఁడును, అన్నింటి కధినాథుఁడును నగు విశ్వకర్మ పరాత్పరుని హృదయమునందెడ తెగక భావించుచున్నాను.

**శ్లో॥ సానగాది మహర్షి మానస ఖేలనం మునిపాలనమ్**
**నాదబిందుకళాతిగం భువనాధిథనామ నామయమ్**
**శాంతపావన మద్వితీయ మంచిత్యవైభవ ముత్తమం**
**విశ్వకర్మ పరాత్పతం జగదాది మవ్యయ మాశ్రయే. 5**

**తా.** సానగుఁడు, సనాతనుఁడు మున్నగు మహర్షుల మనోవీథులందు విహరించువాఁడును, నాదము, బిందువు, కళ అను సుపాసనా కాలము నందనుసరింపఁ దగిన సాధనముల కతీతుఁడును, లోక ప్రభుఁడును, అనామయుఁడును, శాంత పవిత్రుడును, ఆలోచింప నలవికాని విభవము కలవాడును, సర్వోత్తముఁడుననగు విశ్వకర్మ పరాత్పరు నాశ్రయించుచున్నాను.

**శ్లో॥ సర్వతోముఖ మాదిదేవ మసత్సరాది పదాతిగమ్**
**బంధముక్తి వివర్జితం నిజభక్త ముక్తివిధాయకమ్**
**ఘోరసంసృతి దావ పావక శామకంరిపు వారకం**
**విశ్వకర్మ విభుం జగద్గురు మాశ్రయే హృదయాలయే. 6**

**తా.** ఎల్లయెడలను ముఖములు గలవాడును, అనగా ముఖమేవైపునకు

దిరిగిన అది యాదిక్కునందలి వస్తువులను గ్రహించును గావున ఈ దేవుడును అన్నింటి నెఱింగినవాడని సర్వతోముఖ శబ్దములోని యర్థము. ఆదిదేవుఁడును, అసత్తు సత్తు సదసత్తు మొదలగు పదములచే జెప్పుటకు వీలుగాని వాఁడును ("నాఽ సదాసీ న్నో సదాసీత్ " అన్న శ్రుతి ప్రకారము) బంధము ముక్తిలేనివాఁడును, తన భక్తులకు ముక్తి నిచ్చువాఁడును, భయంకరమగు సంసార దావానలమును శమింప జేయువాడును, అంత శ్శతువులగు కామ క్రోధాదుల నణచువాఁడును నగు జగద్గురు విశ్వకర్మ భగవానుని హృదయాలయములో నర్చింతును.

**శ్లో॥ నామ రూప విలాసలాలస శీల మానవదుర్లభమ్**
**బ్రహ్మ విష్ణు మహేశ్వరేంద్ర దివాకరాది సురాత్మకం**
**అప్రతర్క్య మగమ్యమాది మునీంద్రమానస దీపకం**
**విశ్వకర్మ పరాత్పరం హృది భావయామి నిరంతరం. 7**

**తా.** నామము రూపము అను రెండంశముల విలాసమునకే ప్రాధాన్య మిచ్చి సచ్చిదానంద స్వరూపము నెరుంగక యజ్ఞులై నానా దేవతల యాకారాదుల యందనురక్తులై రాగ ద్వేషములకు గురియగు భేద బుద్ధులకు చిక్కనివాఁడును, సృష్టి స్థితి లయము తిరోధానము అనుగ్రహము అను పంచకర్మముల కధిపతులైన బ్రహ్మ విష్ణు ఈశానుఁడు ఇంద్రుడు సూర్యుఁడు నను పంచమూర్తుల తోడను ఇంకను తక్కుంగల దేవతల తోడను గూడిన వాడును, అనగా వారి వారి శక్తులన్నియు సమష్టిగా రూపొందిన విరాట్స్వ రూపుడు నని భావము. ("యో దేవానాం నామధా ఏక ఏవ" అను శ్రుతి ప్రకారము) తర్కించుటకు వీలుగానివాడును, అగమ్యుడును, ఆద్యర్షులగు సానగాదులయు, సనకసనందనాదులయు మానసములను వెలిగించినవాఁ డును నగు విశ్వకర్మేశ్వరుని యెడతెగక మదిలో ధ్యానింతును.

**శ్లో॥ సర్వశక్తి మశేష వేదశిరస్తుతం స్తుతి దీపకమ్**
**నిర్గుణం నిఖిలాత్మకం తమసః పరం జగదాలయం**
**ఆత్మరూప మఖండ సచ్చిదనంత దివ్యరసామృతం**
**విశ్వకర్మ విభుం జగద్గురు మాశ్రయే కరుణాలయమ్. 8**

**తా.** అతీతవ్యస్త సమస్త శక్తులుగలవాఁడును, సర్వోపనిషత్తులచేతను స్తుతింపఁబడినవాఁడును, స్తోత్రములయందు ప్రకాశించువాడును, స్తోత్రములను ప్రకాశింపజేయువాడును, గుణరహితుఁడును, సర్వాత్మకుడును, తమస్సుల కవ్వలనుండువాఁడును (తమసస్తుపారే) జగములకు నివాసమైనవాఁడును, ఆత్మస్వరూపుఁడును, అఖండ సచ్చిదానంద దివ్యరసామృత మూర్తియునగు విశ్వకర్మస్వామిని సమాశ్రయించుచున్నాను.

## పఠన ఫలమ్

**శ్లో॥ విశ్వకర్మాష్టకం పుణ్యం శ్రేయోఽభ్యుదయ కారకం**
**య దిచ్ఛన్ యః పఠేన్నిత్యం తేన తల్లభ్యతే ధ్రువమ్**

**తా.** మోక్షమును ప్రాపంచికాభ్యుదయమును జేకూర్చు పుణ్యప్రదమగు విశ్వకర్మాష్టకమును నెవ్వడేని గోరుచు భక్తితో బఠించునో యాతఁడా ఫలమును తప్పక పొందును.

**ఇది పత్న శ్రీ వీరరాఘవాచార్య కృతమ్**
**విశ్వకర్మాష్టకం సంపూర్ణమ్**

ఈ ప్రకారము ప్రత్న బ్రహ్మర్షి గోత్రుఁడగు వీరరాఘవాచార్యులచే జేయబడిన విశ్వకర్మాష్టకము ముగిసినది.

# శ్రీ విశ్వకర్మ స్తోత్రము

సహస్రార పద్మా న్తరే భాసమానం,
చిదానన్ద సన్మాత్ర మోంకార లీనం,
సమాధౌ మహాయోగిభి ర్గమ్యమానం
భజే విశ్వకర్మాణ మానంద కన్దమ్. 1

మహా నన్దరూపం, హృషీకైర్దురాపం,
విషన్మేఘవాతం, భవాంభోధిపోతం,
జగజ్జన్మహేతుం, దిగా ద్యై రతీతం,
భజే విశ్వకర్మాణ మానన్ద కన్దమ్. 2

రమా భారతీ సేవ్య పాదారవిన్దం,
వియన్ముఖ్య భూతాంచ దిస్యారవిన్దం,
అభీతి ప్రసాదాధ్య హస్తార విన్దం,
భజే విశ్వకర్మణ మానన్ద కన్దమ్. 3

# శిల్పఋషి ప్రార్థనా

వేద కాలమునకు పూర్వమే ఈ దేశములో అయో, దారు, తామ్ర శిలా, స్వర్ణమయములైన పంచశిల్పములను వెలయించి, వేదాధిపతులు – వేద ప్రస్తుతులు జ్ఞానవిజ్ఞానములను సమ్మేళన మొనర్చి, విశ్వహితమునకు విశాలమగు విశ్వ సామ్య యోగమును ప్రవచించిన సానగాది బ్రహ్మర్షుల ప్రార్థన ఈ దిగువ శ్లోకములందు చేయబడినది.

**శ్లో॥ అయశ్శిల్పోపదేష్టార మాద్య వేద ప్రవర్తకమ్**
**విశ్వకృత్రాఙ్ముఖోద్భూత మీడే సానగ సన్మునిమ్.**

**శ్లో॥ యజుర్వేద ప్రవక్తారం దారుశిల్ప ప్రవర్తకమ్,**
**సనాతన మునిం వన్దే విశ్వకృ ద్దక్షిణాస్యజమ్**

**శ్లో॥ సామశ్రుతి విధాతారం తామ్ర శిల్పోపదేశికమ్,**
**అహభూన మునిం పన్దే విశ్వకృతృశ్చిమాస్యజమ్.**

**శ్లో॥ అధర్వశ్రుతి నేతారం శిలాశిల్పకలా సృజమ్,**
**ప్రత్నబ్రహ్మఋషిం వందే విశ్వకర్మోత్తరాస్యజమ్.**

**శ్లో॥ స్వర్ణశిల్ప క్రియాచార్యం ప్రణవజ్ఞాన బోధకమ్,**
**తం సుపర్ణం భజే మౌనిం విశ్వకృత్పంచ మాస్యజమ్.**

**శ్లో॥ త్వష్టుః ప్రజాపతేః పుత్రం నిపుణం సర్వకర్మసు,**
**దేవాచార్య మహం వన్దే విశ్వరూపం తపోనిధిమ్.**

# నతి:

సచ్చిదానంద మాద్యంతరహితం ప్రకృతేః పరమ్,
దిక్కాలాద్యనవచ్ఛిన్నం పరమం తత్త్వమాశ్రయే. 1

అసతస్సత్ప్రవేశాయ తమసో జ్యోతిరా ప్తయే,
మృత్యోరమృత సంప్రాప్త్యై పరంతత్త్వ ముపాస్మహే. 2

గాయత్రీ విశ్వకర్మణా వంచిత్య మహిమాన్వితౌ,
విశ్వశిల్ప ప్రణేతారౌ పితరౌ జగతః స్తువః. 3

సనాతనార్యసత్యం తత్ బ్రువాణం తత్త్వ మద్వయమ్,
అహింసాయోగినం బుద్ధ మాశ్రయే కరుణాలయమ్. 4

శాంతి క్షమా దయా సత్యరూప మీశ్వర పుత్రకమ్,
ఏసుక్రీస్తుం భజే నూత్న మత స్రష్టార మాత్మని. 5

బుద్ధ క్రీస్తు మునీశానాం తత్త్వసార స్వరూపకమ్,
వందే గాంధి మహాత్మానాం దేశ స్వాతంత్ర్యకారకమ్. 6

గాంధీ మహాత్మనః శిష్యం సామ్యయోగ ప్రచారకమ్,
భూదానోద్యమ కర్తారం వినోబా యోగినం భజే, 7

సామ్యయోగ ప్రచారాయ దీక్షా కంకణధారిణః
యమాదినియమోపేతాన్ వన్దే సజ్జన సత్తమాన్. 8

# శ్రీమద్ విరాట్ విశ్వకర్మ పరమేశ్వర సుప్రభాత సేవా స్తుతి

# సుప్రభాతమ్

**రచన : కీ॥శే॥ సౌపర్ణశ్రీ "అభినవమురారి" దురిశేటి వేంకట రామాచార్యులు, నూజివీడు**

ఉత్తిష్ఠ నిత్యసంబుద్ధ సంకృతే భోః సనాతన ।
పూర్వా సంధ్యా త్వదర్చాయై ప్రసాధ్యతి నభోఽఽంగణమ్ ॥ 1

ఉత్తిష్ఠోత్తిష్ఠ గాయత్రీ మాతృపూత మనఃస్థిత ।
స్రష్టా భర్తా స్యనేకేషాం విశ్వేషాం స్త్వా న్విలోకయ ॥ 2

పుత్రాః పంచర్షయ స్తేఽఽద్య నమస్కార పురస్సరాః ।
ఉపాసతే వినీతా స్త్వాం త్వత్ స్తోత్రవిక సన్ముఖాః ॥ 3

తమఃప్రగాఢే గ్రహతారకాదీ
న్యుడూని చిత్ర భ్రమశీలవన్తి ।
మహోమయా న్యాసృజతః సమస్త
విశ్వస్యగుప్త్యై తవ సుప్రభాతమ్ ॥ 4

గ్రహా నవ ద్వాదశ రాశిమధ్యే
చరంతి తత్తత్ఫలదానశీలాః ।
అనాదిత స్త్వత్సమయేన బద్ధాః
శ్రీ విశ్వకర్మన్ తవ సుప్రభాతమ్ ॥ 5

రాత్రిందివం పక్షవతో హి మాసా
నృతూం స్తథా ద్వేవిషువేయనే చ ।
సంవత్సరం సృష్టవతే నమస్తే
భోవిశ్వకర్మన్ తవ సుప్రభాతమ్ ॥ 6

అక్షం ధ్రువం నభసి మేరుధరాగ్రభాగే
జ్యోతీంషి తాన్యగణితాని విధాయ చక్రమ్ ।

రాత్రిందివాత్మక భువే ముహురేక వార
మావత్సరం భ్రమయత స్తవ సుప్రభాతమ్ ॥ 7

భూతాత్మకం జగదిదం పరమాణుమూలం
సోఽ ణుః సమస్త హరణాయ చ సర్వధాలమ్ ।
ఏకత్ర చేదృశవిభిన్న గుణ ప్రదాతుః
భూతాత్మనో భగవత స్తవ సుప్రభాతమ్ ॥ 8

శిల్పా దృతే జ్వలతి నో మిహిర శ్చ వహ్నిః ।
శిల్పా దృతే వహతి నో సలిలం చ వాయుః ।
శిల్పాదృతే భవతినో ధరణిశ్చ ఖంచ ।
శిల్పాత్మనో భగవత స్తవ సుప్రభాతమ్ ॥ 9

దృష్టోఽ య మద్య విదుషా తవపాద ఏవ ।
సోఽ త్రాధునా పృగణనీయ విచిత్రశక్తిః ।
కస్త్వాధి గచ్ఛతి సహస్ర శిరోక్షిపాదం ।
విశ్వాత్మనో భగవత స్తవ సుప్రభాతమ్ ॥ 10

ఋభ్వంగిరో భృగుముఖ గురవః పురాణాః
శిల్పర్ష యో భవతి పూతమానాంసి కృత్వా ।
మందాకినీ పయసి హైమసరోజ మర్ఘ్యం
హంసాయ తే ప్రదదతే తవ సుప్రభాతమ్ ॥ 11

సప్తర్షయో ధ్రువ మహో పరిత శ్చరంత ।
శ్చిత్వారుణారుణరుచా స్ఫుటపంకజాని ।
వ్యోమ్నః పయస్సు దదతే 'య ఇమా' పఠంతో ।
దూరే స్థితాయ భవతే తవ సుప్రభాతమ్ ॥ 12

ఏషా రుణస్య రుచి రత్ర విభాతి పూర్వ ।
భూమీధరస్య శిరసి ప్లవగాధిపస్య వాయోః ।
సుతస్య మహితధ్వజ వర్తినస్తే ।
ప్రత్యర్థినీ భగవత స్తవ సుప్రభాతమ్ ॥ 13

సర్వాసు దిక్షు వికచాని మనోహరాణి ।
పుష్పాణి పత్రపుటకోమలముగ్ధహస్తాః ।
వృక్షా లతా శ్చ విసృజంతి చ తే పరస్మై ।
సంకర్మణే భగవతే తవ సుప్రభాతమ్ ॥ 14

ఏతే నవప్రియశుకాదిపత త్రిసంఘా ।
గీతం కలధ్వని మనోహర మాత్తభక్త్యా ।
గాయంతితే స్తుతిపరం బహుళార్థయుక్తం ।
శ్రీ విశ్వకర్మ భగవన్ ! తవ సుప్రభాతమ్ ॥ 15

మందానిలో వహతి బంధుర మంధనోత్థ ।
మంద్రస్వనేన మధు రేణ లసంతి గేహాః ।
గచ్ఛంతి కర్షకజనా హలకర్ష ణాయ ।
బ్రహ్మాండపత్తనవిభో తవ సుప్రభాతమ్ ॥ 16

వాగీశ కేశవ గిరీశ సురేశముఖ్యా ।
విశ్వస్య గుప్తి మనిశం ప్రభవంతి కర్తుమ్ ।
తే నుగ్రహం సమధిగమ్య మహోమహిమ్నో ।
బ్రహ్మాండపత్తనవిభో తవ సుప్రభాతమ్ ॥ 17

బ్రహ్మాచ్యుతేశ్వర పురందర భాస్కరాది
బృందారకాగ్ర సరవంద్యపదారవింద ।

ఉన్మీల్య నేత్ర మవలోకయ విశ్వవిశ్వం
బ్రహ్మాండ పత్తనవిభో తవ సుప్రభాతమ్ ॥ 18

అర్కేప్రతాప మనిలే వహనం జలేచ
వహ్నౌ చ దాహమపి వర్షణ మంబువాహే ।
విశ్వస్య కోశ భరణాయ నిధాయ భాసి
బ్రహ్మాండ పత్తనవిభో తవ సుప్రభాతమ్ ॥ 19

ఏతేఽబ్ధయశ్చ గిరయశ్చ నదీనదాశ్చ
వ్యోమ్ని క్షితా వుదకసీమని జంతవశ్చ ।
త్వాం విశ్వశిల్పిన మచింత్యగుణం వదంతి
బ్రహ్మాండపత్తనవిభో తవ సుప్రభాతమ్ ॥ 20

ప్రాభాత శీతతర వాతవిధూతతుంగ
భంగైః కరై ర్ధవళచందనచారుచర్చామ్ ।
కుర్వంతి విశ్వపురుషాయ చ తే సముద్రా
బ్రహ్మాండపత్తనవిభో తవ సుప్రభాతమ్ ॥ 21

నద్యో నదాశ్చ సరసీరుహహల్ల కోర్మి
హస్తైః కలధ్వనిమనోహర మర్చనీయమ్ ।
త్వా మర్చయంతి విగుణం త్రిగుణాభిరామం
బ్రహ్మాండపత్తనవిభో తవ సుప్రభాతమ్ ॥ 22

సూర్యాబ్జమంగళ బుధాంగిరసోశనోర్క
పుత్రాది రేష గణనీయగణో గ్రహాణామ్ ।
త్వద్వారసీమసు చర త్యతిభీతభీతం
బ్రహ్మాండపత్తనవిభో తవ సుప్రభాతమ్ ॥ 23

సంక్రందనాగ్ని యమనైర్ఋతపాశపాణి
వాతైక పింగముఖదిక్పతయో వినీతాః ।
తిష్ఠంతి సప్రహరణాః కటి బద్ధచేలా
బ్రహ్మాండపత్తనవిభో తవ సుప్రభాతమ్ ॥ 24

రంభాదిదివ్యరమణీమణయో మనోజ్ఞ
లాస్యప్రబంధసుభగా రథకారముఖ్య ।
నృత్యంతి దేవ విహితాంజలి భద్రముద్రా
బ్రహ్మాండపత్తనవిభో తవ సుప్రభాతమ్ ॥ 25

ఏతే చ నారదముఖా మహనీయతత్త్వాః
సంగీత కేన కలనాదమనోహరేణ తే ।
సంకృతే ర్గుణగణా నభివర్ణయంతి
బ్రహ్మాండపత్తనవిభో తవ సుప్రభాతమ్ ॥ 26

అర్ధోది తార్క కిరణోజ్జ్వలభాసమాన
మర్ఘ్యం ద్విజా దదతి వూదిక మంత్రపూతమ్ ।
పల్లీపురీగృహతటాక నదీనదేషు
బ్రహ్మాండపత్తనవిభో తవ సుప్రభాతమ్ ॥ 27

శ్రీ దేవతా చ గిరిజా ద్రుహిణస్య పత్నీ
సంక్రందనస్య రమణీ సవితు శ్చ సంజ్ఞా ।
నీరాజయంతి మణిదీపశతై ర్భవంతం
బ్రహ్మాండపత్తనవిభో తవ సుప్రభాతమ్ ॥ 28

**ఇతి సుప్రభాతం సంపూర్ణమ్**

# సంధ్యావందనము

ఓం త్ర్యంబకం యజామహే, సుగంధిం పుష్టివర్ధనమ్
ఉర్వారుక మివ బంధనాత్ మృత్యోర్ముక్షీ యమామృతాత్ ॥
(పై మంత్రముతో విభూతి ధరించవలెను)
ఓం అపవిత్రః పవిత్రోవా, సర్వావస్థాంగతోపివా, ।
యస్మరేద్విశ్వ కర్మాణం, సబాహ్యాభ్యన్తర శ్శుచిః ॥
(పై మంత్రముతో ఉదకం ప్రోక్షించవలెను)

## ఆచమనీయము

ఓం విశ్వకర్మణే స్వాహా
ఓం సనాతనాయ స్వాహా
ఓం జగన్మయాయ స్వాహా
ఓం బ్రహ్మణే నమః
ఓం అచ్యుతాయ నమః
ఓం సర్వజ్ఞాయ నమః
ఓం శునాశీరాయ నమః
ఓం వికర్త నాయ నమః
ఓం పరమేష్టినే నమః
ఓం జనార్ధనాయ నమః
ఓం వామదేవాయ నమః
ఓం మఘవతే నమః
ఓం సవిత్రే నమః
ఓం లోకేశాయ నమః
ఓం అధోక్షజాయ నమః
ఓం శంకరాయ నమః
ఓం జిష్ణవే నమః
ఓం పూష్ణే నమః
ఓం ప్రజాపతయే నమః
ఓం విష్ణవే నమః
ఓం శివాయ నమః
ఓం వాస్తోష్పతయే నమః
ఓం కర్మ సాక్షిణే నమః
ఓం స్వయంభూ విశ్వ కర్మణే నమః

## స్మృత్యాచమనీయము

**ఓం స్వాహా ఓం స్వాహా ఓం స్వాహా**
(అని ముమ్మారు జలము తీసుకోనవలెను.)

## భూతోచ్చాటనము

ఓం ఉత్తిష్ఠన్తు భూతపిశాచాః ఏతే భూమి భారకాః
ఏతేషా మవిరోధేన బ్రహ్మకర్మ సమారభే ॥

## ప్రాణాయామము

ఓం భూః ఓం భువః ఓగ్ంసువః ఓం మహః ఓం జనః ఓం తపః
ఓగ్ం సత్యం ఓం తత్స వితుర్వరేణ్యం భర్గోదేవస్య
ధీమహి ధియో యోనః ప్రచోదయాత్
ఓమాపోజ్యోతీ రసోమృతం బ్రహ్మ భూర్భువస్సువరోమ్ ॥

## సంకల్పము

శుభే శోభనే ముహూర్తే ! శ్రీ మహావిశ్వకర్మాజ్ఞయా ప్రవర్త మానస్య అద్యబ్రహ్మణః ద్వితీయ ప్రహరార్ధే కశ్యప బ్రహ్మకల్పే । వైవస్వత మన్వంతరే కలియుగే ప్రథమ పాదే జంబూద్వీపే భరతవర్షే భరతఖండే మేరోర్ధక్షిణ దిగ్భాగే శ్రీ శైలస్యవాయువ్య ప్రదేశే కృష్ణా గోదావర్యోః మధ్య ప్రదేశే జగద్గురు శ్రీ ఆదిశంకరాచార్య వేద ధర్మపీఠ గురుచరణ సన్నిధౌ అస్మిన్ వర్తమాన వ్యవహారిక చాంద్రమానేన స్వస్తిశ్రీ..... నామ సంవత్సరే...... అయణే .....ఋతౌ.....మాసే.....పక్షే .....తిథౌ... వాసరే.... నక్షత్రే శుభ యోగే శుభకరణే ఏవంగుణ విశేషణ విశిష్టాయాం శుభతిథౌ

## ప్రవర

చతుస్సాగర పర్యంతం దేవబ్రాహ్మణేభ్యః శుభం భవతు...... శర్మా అహం ప్రాతఃసంధ్యాముపారిష్యే

## ఉదయమార్జన మంత్రము

### (ఆపోహిష్టామ మంత్రం పఠించవలెను)

### (ప్రాతః సంధ్యావందన మంత్రము)

సూర్యశ్చమా మన్యుశ్చ మన్యుపతయశ్చ మన్యు కృతేభ్యః
పాపేభ్యో రక్షంతామ్ యద్రాత్రియా పాప మకార్షమ్ ।
మనసా వాచాహస్తా భ్యాం, పద్భ్యాముదరేణ శిశ్నా
రాత్రి స్తదవలుంపతు యత్కించ, దు రితం మయి
ఇదమహం । మామమృత యోనౌ । సూర్యే జ్యోతిషి జుహోమి స్వాహా
(ఈ మంత్రము జపించిన తదుపరి జలం పుచ్చుకొనవలెను.)

## స్మృత్యాచమనీయము

స్వాహా స్వాహా స్వాహా
(అని ముమ్మారు జలం పుచ్చుకొనవలెను.)

## ద్వితీయ మార్జనము

దధి కావణ్ణో అకారిషమ్ । జిష్ణోరశ్వస్య వాజినః సురభినో ముఖాకరత్ ప్రణ ఆయూగ్ం షితారిషతు !

పై మంత్రమును రెండుసార్లు పఠించి ఉదకమును శిరస్సున రెండుసార్లు చల్లుకోవలెను.

## మార్జన మంత్రము :

ఓం ఆపో హిష్ఠామ యోభువఃతాన ఊర్జేదధాతన మహేరణాయ చక్షసే యోవశ్శివత మోరసః । తస్య భాజయతే హనః । ఉశతీరివ మాతరః । తస్మా అరంగ మామవో । యస్య క్షయాయ జిన్వథ । ఆపో జనయ థాచనః ॥

పై మంత్రమును చదువుచూ ఉదకం శిరస్సున ప్రోక్షించుకొనవలెను.

## పాప విమోచన మంత్రము

ద్రుపదాదివ ముంచతు ద్రుపదాదివేన్మమము చానః స్విన్నస్స్నాత్వీ మలాదివ పూతం పవిత్రేణేవాజ్యమ్ ఆపశ్శున్ధను మైనసః ॥

ఈమంత్రంచే ఉదకమును అభిమంత్రించి ఎడమవైపున వదలవలెను.

ఓం ఓం ఓం మమ ఉపాత్త సమస్త దురితక్షయద్వారా
శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం (ప్రాతః - మాధ్యాహ్నిక- సాయం)
సంధ్యార్ఘ్య ప్రదానం కరిష్యే !

ఓం ఓం ఓం అని ముమ్మారు ఆచమనీయం చేయవలెను.

## అర్ఘ్య ప్రదానము

ఓం భూర్భువస్సువః తత్సవితుర్వ రేణ్యం భర్గోదేవస్య
ధీమహి ధియోయోనః ప్రచోదయాత్

పై మంత్రముతో గాయత్రీదేవికి 5సార్లు అర్ఘ్యమును అర్ఘ్యపాత్రలో వదలవలెను.

ఓం మిత్యేకాక్షరం బ్రహ్మ అగ్నిర్దేవతా బ్రహ్మ ఇత్యార్షమ్
గాయత్రం ఛన్దం పరమాత్మ స్వరూపమ్ సాయుజ్యం
వినియోగమ్ (పై మంత్రమును పఠిస్తూ) గాయత్రీ మావాహయామి
సావిత్రీ మావాహయామి సరస్వతీ మావాహయామి
ఛందర్షీ మావాహయామి శ్రియమావాహయామి

(పై మంత్రముతో గాయత్రీ మాతను ఆవాహనం చేయాలి.)

## కరన్యాసము

ఓం తత్సవితుః = బ్రహ్మాత్మనే అంగుష్ఠాభ్యాం నమః
వరేణ్యం = విష్ణ్వాత్మనే తర్జనీభ్యాం నమః
భర్గోదేవస్య = రుద్రాత్మనే మధ్యమాభ్యాం నమః
ధీమహి = సత్యాత్మనే అనామికాభ్యాం నమః
ధియోయోనః = జ్ఞానాత్మనే కనిష్ఠికాభ్యాం నమః
ప్రచోదయాత్ = సర్వాత్మనే కరతల కరపృష్ఠాభ్యాం నమః

## అంగన్యాసము

ఓం తత్సవితుః = బ్రహ్మాత్మనే హృదయాయ నమః
వరేణ్యం = విష్ణ్వాత్మనే శిరసేస్వాహా

భర్గోదేవస్య = రుద్రాత్మనే శిఖాయై వషట్
ధీమహి = సత్యాత్మనే కవచాయహుం
ధియోయోనః = జ్ఞానాత్మనే నేత్రత్రయాయ ఔషట్
ప్రచోదయాత్ = సర్వాత్మనే అస్త్రాయ ఫట్
ఓం భూర్భు వస్సువరోమితి దిగ్బంధః

## గాయత్రీ ధ్యానము

ఓం ముక్తా విద్రుమహేమనీల ధవళచ్ఛాయై ర్ముఖైస్త్రీక్షణైః ।
యుక్తా మిందు నిబద్ధరత్నమకుటాం తత్వార్థ వర్ణాత్మికాం ॥
గాయత్రీం వరదా భయాంకుశ కశాం శుభ్రం కపాలం గదామ్ ।
శంఖం చక్రమదార వింద యుగళం హస్తైర్ వహంతీం భజే ॥

## పూర్వముద్రలు

ఓం సుముఖం సంపుటం చైవ । వితథం విస్త్రృతం తథా ।
ద్విముఖం త్రిముఖం చైవ । చతుః పంచముఖం తథా ।
షణ్ముఖోధో ముఖం చైవ । వ్యాపకాంజలికం తథా ।
శకటం యమ పాశం చ । గ్రధితం సున్ముఖోన్ముఖం ।
ప్రలంబం ముష్టికం చైవ । మత్స్యః కూర్మో వరాహకమ్ ।
సింహా క్రాంతం మహా క్రాంతం । ముద్గరం పల్లవం తథా ।
చతుర్వింశతి ముద్రావై । గాయత్ర్యాం సుప్రతిష్ఠి తాః ।
ఇతిముద్రా నజానాతి గాయత్రీ నిష్ఫలాభవేత్ ॥

## ఉత్తరముద్రలు

సురభి జ్ఞాన చక్రేచయోనిః కూర్మోథపంకజమ్
లింగం నిర్యాణ ముద్రాచ అష్టముద్రాః ప్రకీర్తితాః ॥

## గాయత్రీ జపము

ఓం భూర్భువస్సువః ఓం తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్య
ధీమహి ధియోయోనః ప్రచోదయాత్
ఈ మంత్రము 108 మార్లు వీలైతే 1000 మార్లు జపించవలెను.

## దిజ్ నమస్కారము

1) ఓం నమః ప్రాచ్యైదిశే, యాశ్చదేవతా ఏతస్యాం ప్రతివసన్తి తేభ్యో మను బ్రహ్మవంశేభ్యో నమః !
2) ఓం నమః దక్షిణాయై దిశేయాశ్చదేవతా ఏతస్యాం ప్రతివసన్తి తేభ్యో మయ బ్రహ్మ వంశేభ్యో నమః
3) ఓం నమః ప్రతీచ్యైదిశే యాశ్చదేవతా ఏతస్యాం ప్రతివసన్తి తేభ్యోత్వష్టృ బ్రహ్మ వం శేభ్యో నమః !
4) ఓం నమః ఉదీచ్యై దిశే । యాశ్చదేవతా ఏతస్యాం ప్రతివసన్తి తేభ్యో శిల్పి బ్రహ్మ వంశేభ్యోనమః !
5) ఓం నమః ఊర్ధ్వాయై దిశేయాశ్చ దేవతా ఏతస్యాం ప్రతివసన్తి తేభ్యో విశ్వజ్ఞ బ్రహ్మవంశేభ్యో నమః ।

## దేవతా నమస్కారం

ఓం సంధ్యాయై నమః
ఓం గాయత్ర్యై నమః
ఓం సావిత్ర్యై నమః
ఓం సరస్వత్యై నమః
ఓం సర్వేభ్యోదేవతాభ్యో నమః
ఓం సర్వదేవేభ్యో నమః

ఓం ఋషి భ్యో నమః
ఓం మునిభ్యో నమః
ఓం గురుభ్యో నమః
ఓం పితృభ్యో నమః
ఓం కామోకార్షి నమో నమః
ఓం మన్యురకార్షి నమో నమః

## విశ్వకర్మ పరమేశ్వర ఫలప్రాప్తి

సర్వదేవేషు యత్పుణ్యం! సర్వతీర్థేషుయత్ఫలం!
తత్ఫలమ్ విశ్వకర్మాణం । స్తుత్యా ప్రాప్నోతిపూరుషః ॥

## గురుధ్యానమ్

గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః । గురుర్దేవో మహేశ్వరః ।
గురుస్సాక్షాత్ పరంబ్రహ్మ । తస్మై శ్రీ గురవేనమః ॥

## పరిపూర్ణం

ఓం యస్యస్మృత్యాచ నామోక్త్యాతపః పూజా క్రియాదిషు ।
న్యూనం సంపూర్ణతాం యాతి సద్యోవందే జగదీశ్వరీ
మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనం పరమేశ్వరీ
యత్పూజితం మయాదేవీ పరిపూర్ణం తదస్తుతే !

ఓం తత్సత్ శ్రీ మద్గాయత్రీ సమేత శ్రీ విరాట్ విశ్వకర్మపరమేశ్వరార్పణమస్తు (సమయం మించినచో ప్రాణాయామం ఆచరించి కాలాతిక్రమణ దోషపరిహారార్థం చతుర్థార్ఘ్య ప్రదానం కరిష్యే అని చెప్పి అర్ఘ్యం వదలవలెను)

సంబంధమేర్పడినది. కాలాంతరమున శివ వీర్యముచే గర్భవతియైన అంజనికి నెలలు నిండి ప్రసవకాలము సమీపించినది, ఎంతకును మాతృ గర్భమున నున్న శిశువు వెలుపలకు రాక నున్నందున తల్లి భరింపరాని వేదన ననుభవింపసాగెను. ఆపద యందున్న ప్రియురాలిని విడిచిపోలేని వాయుదేవుడు సంచారము మాని యింటి యందుండెను.

వాయువు స్థంభించినందున జీవులకు గాలిలేక ప్రమాదము సంభవించినది. ముల్లోకములు తల్లడిల్లు ప్రళయంబు రానున్నదను భయ మేర్పడినది. అప్పుడన్ని లోకములందున్న సురలు; అసురలు, గరుడులు, గంధర్వులు; కిన్నెరులు; కిం పురుషులు; సిద్ధులు; సాధ్యులు; యక్షాదులందఱును వాయుదేవుని యొద్దకు వచ్చి “మహానుభావా! నీవు చలింపక నున్న ‘లోకములన్నింటికి ప్రమాదము రాగలదు. దయయుంచి వెలుపలకు ర”మ్మని పిలిచిరి.

వాయు దేవుడంతట నైనను వెలుపలకు రాక “అయ్యలారా ! నా ప్రియురాలిపుడు కనలేక చావు బ్రతుకుల మధ్య సతమతమగుచున్నది. నా బాధ నేనెవరితో చెప్పుకొందును? గర్భస్థ శిశువు “నేను నగ్నముగ భూపతనముగాను – నాకు తల్లికడుపు నందుండగనె మొలగోచి; బంగారు జందెము; కర్ణాభరణములు కావలయు” ననుచున్నాడు. మీలో నెవరైన మందీ యుపద్రవము నుండి నన్ను కాపాడిన వెంటనే నేను మీ యందఱిలోనికి వచ్చెద”నని బదులు చెప్పెను.

అంతట ఇందులకు సమర్థులెవరని ఒకరి మొగంబుల నొకరు చూచుకొనిరి బ్రహ్మ “అయ్యలారా! నేనా విశ్వకర్మ యాజ్ఞానుసారముగ సృష్టి చేయగలనె గాని యీ పని చేయ నా చేతగా” దనెను. విష్ణువు “నేనా విశ్వకర్మ యాజ్ఞానుసారముగ వ్యాపకుడనై యుండి దుష్టశిక్షణ – శిష్ట

రక్షణలు చేయగలనే కాని యిందులకు నేనసమర్థుడ” ననెను. మహేశ్వరుడు నేను నా విశ్వకర్మ యాజ్ఞానుసారముగ లయకారుడనై రుద్రనామమున పాపుల నేడ్పించుచు శివ నామమున కల్యాణ ప్రదుడ నయ్యేదనే గాని యిట్టి ఘనకార్యము నాకు మించిన”దనెను.

అంతట అందఱును విశ్వకర్మ పరమేశ్వరుని స్తోత్రము చేయగ నా భగవానుడు గాయత్రీ సమేతముగ వారికి దర్శనమిచ్చి “ఓయీ ! తల్లి కడుపున నున్న పిల్లవాడా ! నీ వడిగిన కౌపీన యజ్ఞోపవీత కర్ణాభరణంబుల నిచ్చితిని. ఇక బయల్పడు'' మనినంతనే అంజని ప్రసవించినది. వాయుదేవుడు లేచి సంతోషంబు మీర కుప్పిగంతులు వైచెను. అందున్న వారందఱును” బ్రతికిపోతిమి” మని శ్వాసలు పీల్చుకొని పుట్టిన బిడ్డకు “ఆంజనేయు”డని నామకరణం జొనరించి దీవెనల నిచ్చిరి.

ఆంజనేయుండంతట విశ్వకర్మకు నమస్కరించి ‘‘దేవా, మీ యనుగ్రహమున నేను సంకల్ప సిద్ధుడనైతిని. నేను సర్వవేళల యందు మీ సన్నిధి యందుండ దగిన యదృష్టమును ప్రసాదింపు”డని వేడుకొనగ నావిరాట్పురుషుండు సంతసించి ‘‘అటులైన నీవు నా ధ్వజము నందుండుము- చిరంజీవి వయ్యెద”వని వర మొసంగెను. ఈ విధముగ విశ్వకర్మ హనుమత్పతాకధారి యయ్యెనని మహనీయులు కీర్తించిరి. తరువాత నా యాంజనేయునకు రామాయణంబున నెంత ప్రధాన స్థానము సిద్ధించినదో యెల్లరు నెఱింగినదియె.

మికీ యుదంతము నెందులకు చెప్పితిననగ శ్రీమద్విరాడ్విశ్వ కర్మ దేవుని యనుగ్రహమున పతితయైన ఆహల్య పంచ మహాపతివ్రత లందు పేర్కొనబడినది. మరియు పెనిమిటి చెంత లేక సంతానవతియైన అంజనికి గౌరవము దక్కినది. ఆంజనేయునకు చిరంజీవత్వము సిద్ధించినది. కనుక

ప్రమాదవశమున నెంత పతితులైన వారైనను విశ్వకర్మ దయపొందగలిగిన వారాయా హీనదశల నుండి పవిత్రులై సకల సంపదలతో కీర్తి పతిష్ఠలు గలిగి చివరకు ముక్తిపొందుట నిశ్చయంబని. శ్రీ మహావిష్ణు లక్ష్మిదేవి కెఱింగించిన తెఱంగున నారదుండు వచించెనని సూత పౌరాణికుండు మునిపుంగవులకు చెప్పెను.

## నాలుగవ కథ

పుణ్యమూర్తులారా । స్వర్గము నేలు దేవేంద్రుడు మహైశ్వర్యశాలి. చింతామణి పీఠము – నందనోద్యానము – కామధేనువు – కల్పవృక్షము లాయన యధీనములు – రంభ ఊర్వశి – మేనక ఘృతాచి తిలోత్తమలను అప్సరసలు వాని విలాసకాంతలు. ఒకానొక దినంబున రంభాదులు సేయుచుండ వారి రాగ తాళ లయ హావ భావముల చూచుచు దేవేంద్రుడు మైమరచి యుండెను.

ఆ సమయంబున దేవతలకు గురుదేవులవారైన బృహస్పతి దేవేంద్రుని చూడవచ్చెను. పరధ్యాస యందున్న దేవేంద్రుడు గురువుల వారి రాక గమనింపలేదు. అది వానిని పరాభవించినట్లుగ భావించిన బృహస్పతి కోపోద్దీపితుడై ఎవరికిని చెప్పక నెచటకో వెళ్లిపోయెను. ఆ సమయంబున దేవ మునీంద్రులొక మహాయజ్ఞము సేయు ప్రత్నమున నుండిరి. కాని బృహస్పతి జాడ తెలియలేదు. ఆ కారణమున యజ్ఞము చేయించదగిన బ్రహ్మ యెవరను సమస్య వచ్చినది.

మునులంతట యోచించి "శచీనాయకా ! యజ్ఞము జరుగదని చింతింపకుము. మన గురువులైన బృహస్పతి సోదరి యోగసిద్ధ – ఆమె భర్త ప్రభాస వసువు. ఆ యోగసిద్ధా ప్రభాసుల కుమారుడగు త్వష్ట విశ్వకర్మ యీ బృహస్పతికి మేనల్లుడు కద ! ఆ త్వష్ట కుమారుడు విశ్వరూపాచార్యుల వారి పౌరోహిత్యమున మన యజ్ఞము నిరాటంకముగ నెరవేరగల"దని

కర్తవ్యము నుపదేశించిరి.

దేవేంద్రుడట్లె విశ్వరూపాచార్యులవారి నాహ్వానించి బ్రహ్మస్థానమున నియమించి యజ్ఞ మొనరించెను. అనంతరమున విశ్వరూపుడు రాత్రి కాలమున రాక్షసులకు హవిర్భాగముల నిచ్చెనను నెపంబున "మీ పౌరోహిత్యము మాకవసరము లే"దని విశ్వరూపుని తిరిగి పంపెను. విశ్వరూపాచార్యుడంతట తిరిగిపోయి తపసు చేసికొనుచుండ దేవేంద్రు డాయనను తపోనిష్ఠ యందుండగనె సంహరించెను. దాన బ్రహ్మహత్యా తాతకము సంభవించిన దేవేంద్రుడు స్వర్గము విడిచిపోయెను.

తన కుమారుడు విశ్వరూపుని చంపినందున త్వష్ట విశ్వకర్మ దేవేంద్రు నంత మొందింప తారకాసురుని సృజించి పంపెను. తారకుని ధాటి కెవరును నిలువలేక భీతిలిపోయిరి. ఇదంతయు తెలిసికొనిన బృహస్పతి దేవేంద్రుని వెదికొని వచ్చి విధివిధానంబుగ విశ్వకర్మ వ్రతము చేయించెను. వ్రత మాహాత్మ్యంబున దేవేంద్రు నావరించియున్న బ్రహ్మహత్యా పాతక మంతరించినది. ముఖాముఖి పోరాడి జయింపరాని తారకాసురుని యుక్తిచేత వధించెను. మరల స్వర్గమునకు ప్రభువై సమస్త భోగముల ననుభవించెనని శ్రీ మహావిష్ణువు లక్ష్మీదేవి కెఱింగించిన తెఱంగున నారదుండు వచించెనని సూతపౌరాణికుండు మునిపుంగవులకు చెప్పెను

## ఐదవ కథ

పుణ్యమూర్తులారా ! ఉగ్రసేనుడను రాజు మధురానగరమును పాలించెను. వాని కుమారుడు కంసుడు మహా బలవంతుడు – క్రూరుడునైనందున తండ్రిని బంధించి రాజ్య సింహాసనము నెక్కెను. కంసుని పినతండ్రియగు దేవలుని కుమార్తె దేవకి. దేవకిభర్త వసుదేవుడను యాదవరాజ కుమారుడు. వేరొక కారణంబున దేవకీ వసుదేవులను గూడ

కంసుండు చెఱయందుంచెను.

నిర్బంధమున నున్న దేవకీ వసుదేవులు చేయునది లేక మనంబున విశ్వకర్మ భగవానుని ప్రార్థింపగ నా దేవదేవుడు వారి స్వప్నమున దర్శనమిచ్చి "దంపతులారా! చింతింపవలదు. శ్రీమహావిష్ణువు కృష్ణుడై జన్మించి నా కష్టముల తొలగింపగలడు. మరియు కారణజన్ముడైన వాసుదేవుడా కంసుడు మొదలైన దుర్మార్గుల నందఱను వధించి లోక కల్యాణము చేకూర్పనుండెను. మీరు కొద్దికాల మోపిక పట్టు"డని చెప్పి యదృశ్యమయ్యెను. దేవకీ వసుదేవులు ఊరట చెందిరి.

అదే విధముగ దేవకీ దేవికి ఎనిమిదవ కాన్పు నందుదయించిన శ్రీకృష్ణుడు వ్రేపల్లెలో యశోదానందుల యింట పెరిగి – గోకులము జేరి – అందుండి వచ్చి కంసుని వధించి మధురకు పాలకుడయ్యెను. ఐనను బలరామకృష్ణుల కచట దినగండము లధికములైనవి. కంసునకు పిల్లనిచ్చిన మామ జరాసంధుడు వాసుదేవునిపై పగబూని పదునారు పర్యాయములు మధురపై దండెత్తి వచ్చెను. జరాసంధుని తాకిడికి నిలువలేక కృష్ణుడు మధురను విడిచి కుటుంబ సమేతముగ వృషస్థలికి బోయి తలదాచుకొనెను.

వృషస్థలి వృకస్థలి యను రెండు రాజ్యములు యాదవ ప్రభువుల పాలన యందున్నది. దుర్యోధనుని మిత్రుడగు కర్ణుడా రెండు రాజ్యంబులను జయించి హస్తినాపుర సామ్రాజ్యమున కలిపినపుడు కృష్ణుడా చోటు నుండియు తన వారందరిని వెంటబెట్టుకొని యడవుల కేగవలసి వచ్చినది. ఆ సమయంబున త్రిలోకసంచారియైన నారదుడు శ్రీకృష్ణునిచే విశ్వకర్మ వ్రతము చేయించి తీర్థ ప్రసాదము లందఱకు నొసంగెను.

విశ్వకర్మ భగవానుండంతట కృష్ణుని యెడల దయగలవాడై కశ్యపుని కుమారుడగు మయబ్రహ్మను నియోగింపగ నామయుడు సముద్రమున

పంౘ్రెండు యోజనముల నిడివియు - పంౘ్రెండు యోజనముల విశాలము గల ద్వారకను నిర్మించెను. ఆ నగరము సుందరములైన సౌధములు - చంద్రకాంత శిలావేదికలు - మనోహరోద్యానములు - మధురాంబు పూరితానేక సరోవరంబులు - నవరత్న మయ కాంచన మండపంబులతో విరాజిల్లుచున్నది. శత్రువులందు ప్రవేశింప వీలువడని సురక్షిత నగరము. "నీ వింకనే భయమును లేక సుఖంబుగ నుండు"మని కృష్ణున కా మయ బ్రహ్మ యొసంగెను. బలరామకృష్ణులు ద్వారకను చేరిన పిదపనే కష్టములు దీరి సుఖసంపదల ననుభవించిరి. జరాసంధాది శత్రువుల నందఱను వధించి దైవాంశ సంభవులుగ పూజనీయులైరి.

ఈ వ్రతము సకల వర్ణములలోని స్త్రీ పురుషు లందఱును చేయదగినది. అవకాశము లేనపుడు మడి మైలలను నియమంబులు కొన్ని లోపించినను. దాన ధర్మములు కొన్ని చేయలేకపోయినను భక్తి విశ్వాసములు గలిగిచేసిన వారికి ఫలితము తప్పక సిద్ధించును. వ్రత లోపమైనను భక్తిలోపము లేని వారికి గాయత్రీ సమేత విశ్వకర్మభగవానుని దివ్యానుగ్రహమున ధర్మార్థ కామ మోక్షములు - సకలాభీష్టభోగములు తప్పక సిద్ధింపగలవు. శ్రీ విశ్వకర్మ వ్రతము నందఱు చేయదగినదని శ్రీమహావిష్ణువు లక్ష్మిదేవి కెఱింగించిన తెఱంగున నారదుండు చెప్పెనని సూతపౌరాణికుందు మునిపుంగవులకు చెప్పెను.

ఇట్లు గాయత్రీ సమేత విశ్వకర్మ వ్రత మాహాత్మ్యము నాలకించిన మునులందఱును సూతమునీంద్రునకు నమస్కరించి "ఇక మీద మేమును ప్రతిసంవత్సర మీ విశ్వకర్మ వ్రతము నాచరించెదము. లోక కల్యాణార్థము ప్రజలందఱకు చెప్పి చేయించెద" మని సెలవుగొని వారివారి నిజాశ్రమంబులకు బోయిరి.

**శ్రీ గాయత్రీ సమేత విశ్వకర్మ వ్రతము సంపూర్ణము**

# శ్రీ విశ్వకర్మ వ్రతము నవమాధ్యాయ విధానము (తొమ్మిది)

**- కీ॥శే॥ స్వర్గ సుబ్రహ్మణ్య కవి**

## ప్రథమోఽధ్యాయః

పూర్వ మొకప్పుడు ధర్మక్షేత్రమున మహర్షులందఱునుగూడి సూత మహర్షిం గాంచి యిట్లు ప్రశ్నించిరి. "సమస్త పురాణముల నెఱింగిన యో మహాత్మా! నిరుపమాన తేజస్వియగు శ్రీమత్పరమేశ్వరుని యొక్క యవతారములు బహువిధములుగా వర్ణింపబడుచున్నవి. వానిలో మిగుల శ్రేష్టమయిన యవతారమేదో దానిని తెలియజేయుము" అని ప్రార్థించిరి. అంత సూతమహర్షి ఇట్లనెను. "ఓ మునులారా। ఈ ప్రశ్న మిగుల గొప్పది. అఖిల జగత్కల్యాణము నుద్దేశించి మంగళకరముగా జేయబడినది. సర్వ జగత్పాలకుండును పరమ పూజ్యుండును అగు భగవానుని యొక్క యత్యద్భుత రూపమునకు నమస్కరించి వర్ణించి చెప్పెదను వినుడు. ఓ తాపసులారా ! ఆ పరమాత్మ యొక్క రూపములు అనంతరములు వానిలో సర్వశ్రేష్టమయిన రూపమొకటి కలదు. తద్వర్ణనమును సావధానచిత్తముతో నాకర్ణింపుడు".

పూర్వమొకప్పుడు క్షీరసాగర మధ్యమున లోక కళ్యాణోత్సవమున నున్న భగవానుడగు విష్ణువును లక్ష్మీదేవి ఈ విధముగా ప్రశ్నించెను. "మహాను భావుండగు జగన్నాయకుని యొక్క రూపము లనేకమైయున్నవికదా పుడమియందలి మానవు లేరూపమును పరమ భక్తితో పూజించుచున్నారు?" అనగా శ్రీ మహావిష్ణువు "ఓ ప్రియవతీ ! నీకు సమస్త రూపముల యందలి గుణదోషములు తెలియును. అందు ఏవి ప్రధానములు ఏవి యప్రధానములు వాని యొక్క గతిభేదములను దెలిపి నీ సందేహములను బోగొట్టెదను. ఆ పరమేశ్వరుడు అఖిల బ్రహ్మాండమును తనయందు లీనముచేసుకొని యోగము చేత స్వానుభవముతో నుండును". అట్టి సమయమున మితిలేని బ్రహ్మాది

లోకములను, ఏ రూపముతో సృష్టించుచున్నాడో యా రూపమును విశదముగా జెప్పుచున్నాను. లక్ష్యముతో వినుము. ఓ దేవీ ! మహాద్భుతము తేజోవ్యాప్తమును బహు సూర్యుల కంటె నధిక ప్రకాశమును అగు జగన్నాయకుడు విరాడ్విశ్వకర్మ మనుష్యాదుల సృజింపదలచి పుణ్యులలో ప్రథముండగు తపస్విని బ్రహ్మనుగాఁ బుట్టించెను. ఆ మహాతేజస్వియగు బ్రహ్మదేవునికి స్తుతియజ్ఞ గాయన ప్రతిపాదకమగు ఋగ్యజుస్సామ వేదములను నుత్తమవిధానమున ఉపదేశించెను. అదే ప్రకారముగా శిల్ప విద్యా ప్రతిపాదకమగు నధర్వ వేదమును తదువవేదమగు శిలవేదమును జెప్పెను. వానిని జదివిన శిల్పుజ్ఞులగు ఋషులు శిలశాస్త్రముల రచించియనేక వస్తువుల నిర్మించిరి. అట్టి విశ్వకర్మ పరమాత్మ స్వరూపమును క్షణకాలము ఏకాగ్రచిత్తముతో నెవడు ధ్యానము చేయుచున్నాఁడో యతనికి సర్వ సంకటములు దూరముగా తొలగిపోవును. ఇందు సందేహములేదు, తేజోవంతమైన శ్రీవిశ్వకర్మ యొక్క దివ్యస్వరూపమును ఏ శిలి ధ్యాన యుక్తముగా తలంచుచున్నాఁడో అతడు దుఃఖమంతయు నశించి పవిత్రుడగుచున్నాడు.

"ఈ సర్వోత్తమమగు విశ్వకర్మ స్వరూపమును లోకమున నెట్లు పూజింపవలెను ? మనుష్యులకు సమస్తమగు కోరికల సమృద్ధి నిచ్చునట్టి యీ వ్రతమును గురించి సమగ్రముగా జెప్పుమనగా విష్ణుమూర్తి ప్రసన్న వదనుడై ఈ వ్రతమును గురించి చెప్పిన విధానము వినుడు" అని సూత మహర్షి ఇట్లు చెప్పదొడగెను.

"పూర్వ మంగిరుఁడను పేరుగల యొక మహర్షికలఁడు అతడు హిమాలయ పర్వత సమీపమునగల గంగానదీతీరమున కొంతకాలము భయంకరమయిన తపస్సును జేసెను. తపమొనర్చునపుడా మహర్షికి

మనశ్శాంతి లేదయ్యేను. దప్పికగొనిన జింక యెండమావులను జూచి జలమని భ్రమించి యిటునటు పరుగెత్తి నీరు గానక పరితపించినట్లు చంచలమనస్వియై వివిధ రూపములను గూర్చి తపంబొనర్చి ఫలము ననుభవింపలేక పరితపించు చుండెను. ఆ సమయమున నాకస్మికముగా ఆకాశవాణి యిట్లు పలికెను. "ఓ తపోధనా! నీ తపస్సు వ్యర్థమగుచున్నది కారణమేమనిన నీ చిత్తము స్థిరముగా నుండలేదు. బాణమును గుఱిచూసి ప్రయోగించినట్లయిన వధ శక్యమగును అటుల లక్ష్యము నిలుపనిచో బాణము వ్యర్థమగును అటులే నీ తపశ్చర్యగతి వివిధ రూప దర్శనములచే వ్యర్థమై లోకమున నవహాస్యపాత్రుడవగుచున్నావు. జగదుత్పత్తి పాలన సంహారకర్తయును మహాతేజస్వియగు భగవాన్ విశ్వకర్మ యొక్క రూపము పంచ ముఖములను, దశబాహువులను గలిగియున్నది, ఆ మహాదేవుఁడు సగుణస్వరూపముతో సరస్వతీ లక్ష్మీ దేవతలచే బూజింపఁబడుచున్న పాదములు గలవాఁడై యున్నాడు. అట్టి రూపము నహర్నిశమును చిత్తముతో ధ్యానమొనర్చుము. క్షీరసాగరమధ్యమున స్వయముగా విష్ణువు ఈ దివ్య స్వరూపమును నాకుపదేశించెను. ఆ దివ్యరూప ధ్యానమొనర్చుటకు నాకిప్పటికిని గగుర్పాటు కలుగుచున్నది. సర్వశుభతిథులయందును అమావాస్యల యందును సర్వకర్మముల నిర్వర్తించుకొని ఈ వ్రతము నాచరించుము". అని లక్ష్మీదేవి ఆకాశమునుండి పలికిన మాటలను విని మహర్షి యాంగిరుఁడాశ్చర్యమొంది యప్పుడే విశ్వకర్మ ధ్యానమును జేసిన వాఁడాయెను.

ఏకాగ్రచిత్తముతో నావిశ్వకర్మను నఖండధ్యానము చేయగా అతఁడా విశ్వకర్మ కృపవలన శిల్పజ్ఞానము కలవాఁడయ్యెను. అధర్వణవేదము అర్థసహితముగ దనహృదయమునఁ బ్రవేశించెను. తరువాత తత్వ

జ్ఞానియును మునిశ్రేష్ఠుఁడును అగు నాంగిరుండు తన జ్ఞానసంపత్తిచే విమానాది యంత్రవిద్య మున్నగుననేక విధములయిన యాశ్చర్యకరములగు శిల్పవిద్యలను ప్రకటించిన వాడయ్యెను. అంగిరుని వంశమున బారంపర్యముగ బృహస్పతి, సుధన్వుఁడు, ఋభువులు మొదలగు మహర్షులు శిల్పశాస్త్రవేత్తలలో ముఖ్యులుగా జన్మించిరి.

అంగిరుఁడప్పుడు దర్శించిన యా శ్రీవిరాడ్విశ్వకర్మ దివ్యరూపము జగత్ప్రసిద్ధి నొందెను ఆ ప్రకారముగా బారంపర్యమైన యా కథలను వర్ణించి నేనును బవిత్రుఁడనైతిని.

"ఓ ఋషులారా ! ఎవ్వరీ యత్యంత రహస్యమైన కథను వినుచున్నారో వారికి వినినంతనే జ్ఞానము కలుగుచున్నది. మానవులను భవసాగరము నుండి తరింపఁ జేయునదియు మహాతేజోవంతమైనదియునగు నీ విశ్వకర్మ వ్రతమును జనులు ఆచరించి తమ తమ అభీష్టములు సిద్ధింప చేసుకొనగలరు అని సూత మహర్షి అక్కడ ఉన్న ఋషులకు తెలియజేసెను.

ఇతి శ్రీ విశ్వకర్మసంహితాయాం సృష్టిఖండే
విశ్వకర్మకథాయాం ప్రథమోఽధ్యాయః ॥

## ద్వితీయోఽధ్యాయః

శ్రీ విశ్వకర్మ దివ్య స్వరూపమును శ్రీకృష్ణుడును శంకరుఁడును పూజించిన విధానమును మీకు సవిస్తరముగా తెలిపెదను సావధానులై వినుడు అని సూత మహర్షి ఋషులకు చెప్పిన ప్రకారము సాంగముగ నాకర్ణింపుడు" అని చెప్పదొడగెను.

ఒకానొకప్పుడు మధుకైటభులను దానవులు విష్ణువుతో యుద్ధ మొనరించిరి. అప్పుడు విష్ణువు మధుకైటభులను దునుమాడి ఆవల పెట్టిన తన యొక్క ధనుస్సును ఆనుకొని శిరము దానిపై నుంచి నిద్రించెను. ఆ

సమయమున దేవతలందరు ప్రళయము సంభవించునను భయముతో బ్రహ్మదేవుని యొద్దకుఁబోయి యిట్లు పలికిరి. స్వామీ ! శ్రీవిష్ణువు నిద్ర వహించుచున్నాఁడు, కనుక ఆయనను జాగ్రత్తకు తెచ్చుటకు ఏదైనా చదపురుగును నిర్మించవలయును. వింటినారి తెగిన వెంటనే వారికి మెలకువ కలుగును. ఆ మాట వినిన తోడనే బ్రహ్మ పురుగును నిర్మించి వింటినారిని తెగ గొఱుక నాజ్ఞయిచ్చెను. ఆ చదపురుగు బ్రహ్మతో స్వామీ! శ్రీ విష్ణువు నిద్రించుచుండ విఘ్నమొనర్చునట్టి పాపకార్యమునకు నన్నేల ప్రేరేపించుచుంటివి? ఇట్టి పని నేనెట్లు చేయగల్గుదును? అనుచుండ దేవతలు నీకు హవిర్భాగము నొసంగుదు మనిరి. ఇంతలో చదపురుగు శార్ఙ్గమును జేరి యా నారిని తెగగొఱికెను. అది భీకరమైన గొప్ప ధ్వనితో గూడి విష్ణువు యొక్క శిరస్సును తెగవేసెను. విష్ణువు శిరస్సు తెగి అతివేగమునబోయి దేవతలకు కనుపడదయ్యే అట్టి ఘోరవిపత్తును జూచి లక్ష్మీదేవి కన్నులనిండ నీరు కలదియై ఆదిశక్తిని ప్రార్థించెను దేవతలును ప్రార్థించిరి. “తెగిపోయిన యా విష్ణు శిరస్సును దివ్యదృష్టితో జూచినను నాకు గనఁబడుటలేదు. కనుక మన మెల్లరముగూడి మహానుభావుఁడగు విశ్వకర్మను బ్రార్థింతుము. అని ఆదిశక్తి చెప్పుటతోనే సురలెల్లరును నిశ్చల చిత్తముతో విశ్వకర్మను బ్రార్థింతుము. విశేష బుద్ధిశాలియగు నా విశ్వకర్మ దేవతలకు బ్రత్యక్షమయ్యెను. దేవతలు విశ్వకర్మతో “స్వామీ ! యీ విష్ణువును శిరస్సుతో గూడిన వానిగా జేయు” డని యాచించిరి. ఆ మహనీయుఁడు కొంచె మాలోచించి అశ్వముఖుడైన గంధర్వునియొక్క శిరస్సును తెగగొట్టి విష్ణువు యొక్క మొండెమున కతికించి పంచ ప్రాణముల నాయా స్థానములందు నిలిపెను. వెంటనే విష్ణువు నిద్రనుండి మేల్కొనిన వానివలె మాటలాడ మొదలిడెను. గుఱ్ఱపు మొగముతోనున్న విష్ణువును గూర్చి

దేవతలందరు శంకించి నిజమైన విష్ణువేయైనచో మన ప్రశ్నలకు సమాధాన మివ్వఁగలడని వారి వారి యిష్టానుసారముగా ప్రశ్నించ నారంభించిరి. విష్ణుమూర్తి యా ప్రశ్నలకు వెంటనే సమాధాన మిచ్చుచుండెను. అంతట మహానుభావుఁడగు విశ్వకర్మ పదములకు లక్ష్మిదేవి సంతోషముతో నమస్కరించెను. లక్ష్మీ సరస్వతు లిరువురు విశ్వకర్మ పద ద్వయమును కడిగిరి. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులును ఇంద్రాదులును మిగుల సంతోషముతో సృష్టి స్థితి లయకర్తయగు విశ్వకర్మను భక్తితో భజించిరి. "పరమార్థ స్వరూపఁడవు, మహాత్ముఁడవు, శుద్ద సత్తస్వరూపఁడవు, మహిమకలవాఁడవు, నగు నో విశ్వకర్మా ! నీకు నమస్కారము. స్వర్గలోకము నను, భూలోకమునను, అంతరిక్షమునను, పాతాళమునను ఒకటి యననేల అంతటనుగల శిల్పమునందు గన్పట్టువాఁడవును, ప్రపంచమునకు మూలమైనవాఁడవును సమస్తమును నీవేయైనవాఁడవును, సమస్త రూపము కలవాఁడవును, అగు నో విశ్వకర్మా ! నీ కొఱకు నమస్కారము". అని ప్రార్థించిరి.

సూతుడిట్లు చెప్పి ఓ మునులారా ! ఏ మానవుడు సద్భక్తియుక్తముగ విశ్వకర్మను ధ్యానించుచున్నాడో అతడు క్షణకాలములో ఆపదల నుండి, విముక్తుడగుచున్నాడు అని చెప్పెను.

ఇతి శ్రీ విశ్వకర్మసంహితాయాం సృష్టిఖండే
విశ్వకర్మకథాయాం ద్వితీయోఽధ్యాయః ॥

## తృతీయోఽధ్యాయః

ఓ మునులారా ! విశ్వకర్మ మాహత్మ్యమును గూర్చిన మఱియొక కథను చెప్పుచున్నాను వినుఁడు. పూర్వము దీర్ఘతముడను నామాంతరముగల గౌతమ మహర్షి కలడు. ఆయనకు అహల్య యను

పతివ్రత భార్యయై యుండెను ఆమెకు అంజనాదేవి అను సుందరి జనించెను. అంజనాదేవి యను నామె జాత్యంధయై వాయుదేవునికి భార్యగా నాయెను, వాయుదేవుఁడు తన మనస్సులో "నేను మూఁడు లోకములకు ప్రాణమైనవాఁడను ఇంత గొప్పవాఁడడనగు నాకు జాత్యంధ కులసతి యయ్యేఁగదా" యని విచారపడుచుండెను. ఇట్లు వాయుదేవుఁడు విచారపడుచు తగిన యుపాయము మనస్సులో నాలోచించెను. జాత్యంధ పరిహారకమైన మహామంత్రమును అంజనాదేవి కుపదేశించెను. ఆమె మఱ్ఱిచెట్టు క్రింద పద్మాసనాసీనయై తపస్సు చేయుచుండెను. ఇంతలో కైలాసశిఖరమున నున్న శివుఁడు లోకములను చూడఁదలచి ఆకాశమార్గమున వచ్చెను.

అతడు మర్కటముల యొక్క సంయోగమును చూచి వీర్య స్థలితుడయ్యెను. ఆ వీర్యము అంజనా దేవి యొక్క దోసిట బడెను. ఆమె తన దోసిటఁబడ్డ వీర్యము వాయుదేవుఁడు తన కొసఁగిన యాహారమని యెంచి భుజించెను, ఆ వీర్యమంజనాదేవి గర్భమున ప్రవేశించినంతనే ఆమెకు అంధత్వముపోయి సమస్తము కనుపడెను ఇంతేగాక తొమ్మిది ఘడియలలో గర్భము వృద్ధియాయెను. ఆ యొక్క గర్భభారముచేత బడలినదియై తనపతియగు వాయుదేవుని సమీపమున దుఃఖించెను. అతడును బ్రహ్మ విష్ణు మహేశ్వరులను బిలిచెను. ఆ త్రిమూర్తులు వచ్చి దయతో వాయుదేవుని వీక్షించి కారణమడిగిరి. అప్పుడు వాయుదేవుఁడు గర్భభారముతో బడలియున్న తన భార్యను వారికి జూపెను. ఆ త్రిమూర్తులును ఆమె గర్భభారమును జూచి యచ్చెరువంది గర్భస్థ శిశువుతో నిట్లనిరి. "ఓయీ నీవు నీ తల్లినెందులకు శ్రమపెట్టుచున్నావు త్వరగా బయలు దేఱి యీ గర్భభారమునుండి యామెను విమోచనము చేయుము".

అనగా గర్భస్థ శిశువు ఇట్లు చెప్పెను “నేను మానవంతుఁడను, కనుక నాకు గోచి, జందెము, కమండలము మున్నగునవి యొసంగుడు ఇప్పుడే బయటపడెదను” అని శిశువు చెప్పఁగనే బ్రహ్మ విష్ణు మహేశ్వరులు తమలో తామాలోచించి యా వస్తువుల నొసఁగ మాకు శక్తి లేదు విశ్వకర్మయే సమర్థుఁడు. అని నిశ్చయించి తమ తమ మనస్సులో విశ్వకర్మను స్మరించిరి. దేవతా శ్రేఁష్ఠులగు త్రిమూర్తులు స్మరించినంతనే మేఘవాహనారూఢుండై పంచవక్త్రములతోను, ఫాలనేత్రములతోను, దశ బాహువులతోను విశ్వకర్మ ప్రత్యక్షమాయెను. ఇట్లు ప్రత్యక్షమైనంతనే బ్రహ్మ విష్ణీశ్వరాదులు విశ్వకర్మ భగవానునికి నమస్కరించి యావద్వృత్తాంతము విన్నవించిరి. ఆ మహానీయుఁడు అది వినినతోడనే గర్భస్థ శిశువుతో నిట్లు పలికెను. “ఓయీ! నీవు కోరినట్లు బంగారు మొలత్రాడును, యజ్ఞోపవీతమును, గోచియును, చెవులపోగులును ఇచ్చుట కష్టతరము. అయినప్పటికి నీవు కోరినందున ఇచ్చెదను”.

ఇట్లు పలికినతోడనే యా గర్భస్థ శిశువు సంతోషము కలవాడై విశ్వకర్మను స్తుతించుచు గంభీరముగా నిట్లు వచించెను. “జగద్గురుండవగు నో విశ్వకర్మా ! నా కోరిన వస్తువుల నొసంగితివేని, సమస్త దేవతలలో గొప్పవాఁడవు. దేవతలందఱిలో దాతవు, నీకంటె మఱియొక దాత యెచ్చటను లేఁడు. కావున సర్వదా నీ యాజ్ఞావశుఁడనై యుండెదను. నీవేమి శాసించుచున్నావో అది యిప్పుడే శాసించుము. తప్పక నీబంటునై యుందును”. ఆగర్భ శిశువుచే నిట్లు చెప్పబడినవాడై యా విశ్వకర్మ యిట్లు శాసించెను. “ఓయీ! నీవు నా యొక్క ధ్వజమున నుండి యెల్లప్పుడు ప్రకాశింపుము”. విశ్వకర్మ యీ రీతిగా జెప్పినంతనే యా గర్భస్త శిశువు మరల నిట్లు వచించెను. “ఓ దేవా ! నీయాజ్ఞానువర్తినై నీ ధ్వజమున

సర్వదా ప్రకాశింతును". అని ఆ శిశువు పలికిన తోడనే మహామతిమంతుఁ డగు విశ్వకర్మ తన మనస్సులోఁ దలఁచినంత మాత్రముననే కపి రూపముననున్న యా శిశువునకు కాంచనమయమగు కౌపీనము బ్రహ్మ సూత్రము, కటి సూత్రము, కుండలములు, కమండలువు అన్నియు నాయెను. ఆ ఆభరణములను ధరించి బహిర్గతుఁడయిన యా పుత్రుని యొక్క తల్లిదండ్రులు సంతోషించినవారై అతనికి హనుమంతుఁడను నామకరణ మొనర్చిరి. అచటనున్న దేవతలు, ఇంద్రాది దిక్పాలకులు, త్రిమూర్తులు, సంతోషించినవారై సృష్టి స్థితి లయ కారకుఁడగు నా విశ్వకర్మను భజించిరి, హనుమంతుఁడును సంతోషముతో విశ్వకర్మ యొక్క ధ్వజమున నుండెను.

ఏ మానవుఁడు నిత్యమును విశ్వకర్మను ధ్యానించుచున్నాడో అతనికి సంకల్పములు సిద్ధించుటయే కాక అతడు దీర్ఘాయుష్మంతుఁడు నగుచున్నాడు.

ఇతి శ్రీ విశ్వకర్మసంహితాయాం సృష్టిఖండే
విశ్వకర్మకథాయాం తృతీయోఽధ్యాయః

## చతుర్థోఽధ్యాయః

ఓ మునులారా ! కథను చెప్పువారికిని, వినువారికిని, పాపములను బోగొట్టునదియు, కోరికలను సిద్ధింపజేయునదియు, అగు విశ్వకర్మ మాహాత్మ్యమును గూర్చి మరియొక కథను జెప్పుచున్నాను వినుడు. పూర్వము దేవతలకు రాజగు నింద్రుఁడు విశ్వకర్మ వ్రతము నాచరించి దైత్యవర్గమును జయించి శ్రేష్ఠమైన సమస్త సౌభాగ్యములను బొందెను.

ఇంద్రుడు మూడులోకములయందు బ్రసిద్ధిగాంచిన యైశ్వర్యమదమున సన్మార్గము నతిక్రమించెను. దేవతలు, వసువులు, రుద్రులు, ఆదిత్యులు

ఋషులు, విశ్వేదేవతలు, సిద్ధులు, సాధ్యులు, చారణులు, గంధర్వులు, అశ్వినీ దేవతలు, విద్యాధరులు, అప్సరులు, కిన్నరులు, గరుడులు, ఉరగులు, మున్నగువారు స్తుతిసేవ గీత నృత్యాదులతో వినోదము జూచుచుండ శ్వేత చ్ఛత్రమునీడను శచీ సహితముగా సింహాసనమునుండి వింజామరలతో విసరించు కొనుచుండెను. ఆ సమయమున దేవాచార్యుడును, తనగురువును, ఆచార్యుడును అగు బృహస్పతి యా సభకురాగా ఇంద్రుఁడు ఆ మహనీయుని జూచియును నమస్కరించుటయు, సింహాసనమునుండి లేచి యెదురేగుటయు చేయలేదు. ఆ బృహస్పతి ఇంద్రుని చేష్టలకు కోపమూని యేమియుననక వెంటనే స్వగృహమున కరిగెను. ఇంతలో విశ్వకర్మ వ్రత మాచరించు కాలము సమీపించగా గురువు లేని కారణమున ఇంద్రుఁడు ఆ కార్యమును తలపెట్టడయ్యెను. విశ్వకర్మ వ్రతమును బరిత్యజించుటచే ఇంద్రుఁడు నానా దుఃఖములు ననుభవించుచు మనస్సు చెడినవాడై యధికారమునుండి తొలఁగింపఁబడెను.

శుక్రాచార్యుడు దివ్యదృష్టిచే నీ విషయమును దెలిసికొని తన మంత్రబలముతో దానవులకు సాహాయ్య మొనర్చుచు నాకస్మికముగా స్వర్గమును ముట్టడింపజేసెను. ఆ సమయమున ఇంద్రుఁడు పారిపోవుటయే కాక యధిక శరాహతులైన సురలెల్లరు గూడి యా యుపద్రవము నెట్లు తప్పించుకొన గలమనుకొనుచుండిరి. ఇదియేమి? ఇది ఎవరియొక్క మహిమయైయుండును ? మనస్సుతో బరిశీలించుటకు గాని వాక్కుతో వర్ణించుటకు గాని అసాధ్యమైయున్నది. ఆ శుక్రఁడింద్రజాల విద్యయందు గొప్పవాఁడు అని దేవతలు విచారపడుచుండిరి. శచీదేవియును భర్తను గాంచి మిగుల దుఃఖించెను. ఇంద్రుఁడును కలతపడిన మనస్సుతో మనము విశ్వకర్మ వ్రతమును ద్రోసిపుచ్చి, మితిలేని యిక్కట్ల పాలగుచుంటిమి అని

పదే పదే విచారపడుచుండెను.

అట్లయినచో మీచేత నిప్పుడే విశ్వకర్మ వ్రతము నాచరింపఁ జేయుదుమని దేవతలందరును గూడి యా బృహస్పతి నివాసమున కరిగిరి. అతఁడు అధ్యాత్మ మహిమచేఁ తిరోహితుఁడయ్యెను, సురాచార్యుఁడు కనబడనందుల కింద్రుఁడు విచారపడి దేవతలను జూచి యిట్లనియె. "అయ్యో ఎంత చెడ్డ పని చేసితిని ? అల్పబుద్ధిచే గొంచెపు ధర్మముల ననుసరించి నా గురువగు బృహస్పతికి దూరమైతిని. ఇప్పుడు నాగతి ఏమి? ఈ ముప్పును దప్పింప సమర్థుండెవడు ? ఆర్తుఁడనైన నేనిపుడేమి చేయఁగలను?" అని ఆలోచించి ఇంద్రునితో సహా దేవతలెల్లరును బ్రహ్మ యొద్దకు వెళ్ళి నమస్కరించి "మమ్ము రక్షింపు" మని ప్రార్థించిరి. బ్రహ్మ యా దేవతలను జూచి దయతో వారల నోదార్చుచు నిట్లు పలికెను. "మీరలైశ్వర్య మదముచేత బ్రహ్మణ్యుడును ఆచార్యుండును అగు బృహస్పతిని తిరస్కరించి శత్రువులకు నోడి యిక్కట్లు పడుచుంటిరి సురపతీ! భక్తితో శుక్రు నారాధించి స్వర్గమును బొంది యైశ్వర్యవంతులై యున్న నీ పగతురఁ జూడుము. భగవంతుని యందు పగఁబూనిన వాఁడెప్పుడును కీడు పొందుచునే యుండును. ఆ కారణమువలన మీరు త్వరగా వెళ్ళి త్వష్ట కుమారుఁడును, తపస్వియును అగు విశ్వరూపాచార్యుని సేవింపుడు. బ్రాహ్మణ శ్రేష్ఠుఁడగు నాతడు మీ కోరికలు నన్నింటిని సిద్ధింపజేయును". బ్రహ్మ యిట్లు చెప్పగా దుఃఖము నుడిగిన వారై సురలప్పుడే విశ్వరూపుని యొద్దకు జేరి యిట్లర్థించిరి. "ఆచార్యా ! మా యొక్క విచారమును పోగొట్టి మమ్ముల రక్షింపుము. మా వందనముల స్వీకరించి యాచార్యత్వమున కనుగ్రహింపుము". ఇట్లు దేవతలచేఁ బ్రార్థింపబడి మహాతపశ్శాలియగు విశ్వరూపుఁడు చిఱునవ్వుతో నిట్లు పలికెను. "ధర్మవేత్తలచే నిందింపఁ

బడిన పౌరోహిత్యమును బ్రహ్మాదులు కోరుటచేతను మీరెల్లరు బ్రార్థించుటచేతను, నంగీకరించుచున్నాను. నా శక్తి కొలది మీ కోరిన యర్థంబు సాధించెదను".

ఆ దేవతల యొక్క ప్రార్థన విని విశ్వరూపుఁడు ఉత్కృష్టమైన నియమముతో బురోహిత కార్యము నిర్వర్తించెను. ముందుగానే ఇంద్రునితో నిట్లు చెప్పెను. ఓయీ ! నీ విచ్చటనే విశ్వకర్మ వ్రతము నాచరింపఁ ప్రతిజ్ఞచేసి భవన్నిలయంబునకు జని వెంటనే భక్తితో వ్రత మాచరించుము. "విశ్వరూపండిట్లు చెప్పగా విని ఇంద్రుఁడు మిక్కిలి ఉత్సాహము కలవాఁ డై వెంటనే విశ్వకర్మ భగవానునికి నమస్కరించి వ్రతమాచరింపఁ బ్రతిజ్ఞ చేసి ఆ విశ్వరూపుని దేవతలనుగూడి స్వర్గమునకుఁబోయెను. అంతటఁ కల్పోక్తప్రకారముగా విశ్వకర్మ వ్రతమును జేయఁగా విశ్వరూపుడు పౌరోహిత్యమును నెఱవేర్చి కథను గూడ చెప్పెను".

ఆ విశ్వకర్మ యొక్క యనుగ్రహముచేత ఇంద్రుడు దానవులను జయించి స్వర్గమును బహుకాలము న్యాయముతో పాలించి సుఖించెను.

ఇతి శ్రీ విశ్వకర్మసంహితాయాం సృష్టిఖండే
విశ్వకర్మకథాయాం చతుర్థోஉధ్యాయః

## పంచమోஉధ్యాయః

ఓ మునులారా ! ఇప్పుడు తిరిగి మఱియొక కథను జెప్పుచున్నాను. వినుఁడు. "పూర్వకాలమున రాముఁడు పదునాలుగు సంవత్సరములు వనవాసము చేసెను. ఆ వనవాసము చేయునప్పుడు సీతాదేవి లక్ష్మణులతోఁ గూడి పంచవటి క్షేత్రమున నుండెను. అచ్చటనుండగా నతనియొక్క భార్యను రావణుఁ డెత్తుకొని పోయెను. రాముఁడుభార్య కనఁబడనందున దుఃఖము చేత తన భార్యను వెదకుటకు బయలుదేరి మార్గములో కొనప్రాణముతో

నున్న జటాయువును జూచెను. పిమ్మట సీతను వెదకుచు అరణ్యమందున్న కబంధుఁడను రక్కసుని జంపెను. తదుపరి సుగ్రీవుఁడను వానర రాజు యొక్క స్నేహము కలిగి యతనివలన బంపఁబడిన వానర సైన్యమును గ్రహించెను. పిదప వానరసేనలో నొకడైన హనుమంతుఁడు లంకా పట్టణమును బ్రవేశించి యుద్యానవనమునందు సీతను జూచెను. ఆ ప్రకారము సీతను గూర్చి యింకను శత్రుబలాబలములను దెలిసికొనుట మొదలగు భటుఁడు చేయవలసిన కార్యములన్నియుఁ జేసెను. పిమ్మట తిరిగివచ్చి రామున కా లంకయందున్న సంగతులన్నింటిని చెప్పెను. తరువాత రాముఁ డాసంగతులను విని యా హనుమంతుని వాక్యప్రకారము సుగ్రీవుఁడు మొదలగు వానరులతో కదలి మెల్లగా సముద్రతీరము చేరెను. పిమ్మట వారధి కట్టఁదలచి వానరులందరును కొండలవంటి రాళ్ళను దెచ్చి యా జలనిధియందుఁ బడవేయుచుండిరి. అటుల వేలకొలఁది కొండలను దెచ్చి వైచుచుండినను సముద్రము కట్టుబడలేదు. ఇట్లనేక పర్యాయములు అనేక విధములుగా బ్రయత్నించి విఫలమనోరథులైరి. అప్పుడు రాముఁడు చూచి భయపడి లక్ష్మణునితో నిట్లు పలికెను. "తమ్ముఁడా ! ఇది యేమి యాశ్చర్యమో నాకు తెలియుట లేదు. ఇంతవరకు సముద్రమున నుంచిన రాలన్నియు వెంటనే నీటిలోనే మాయమైనవి. ఇచట నొకటియును లేదు. ఓ లక్ష్మణా ! ఇటువంటి మహాసముద్రమునకు నిపుడెటుల వంతెన గట్టఁగలను ? ఏ పుణ్యముచే దీనిని దాటఁగలను ?" లక్ష్మణుఁడు చెప్పుచున్నాడు "ఓ అన్నా ! రామా ! నీవు ఆత్మజ్ఞానము కలవాఁడవు నీకుఁ దెలియని దేమున్నది? అయినను నన్నడిగితివి గాన చెప్పెదను వినుము. ఇచ్చట బకదాల్భ్యుఁడను మహర్షి యొక్క యాశ్రమము కలదు. అది ఇచటికి రెండుక్రోసుల దూరముండును. ఆ బకదాల్భ్యముని

యనేక బ్రహ్మకల్పములు చూచినవాఁడు కనుక వయోజ్యేష్ఠుఁడును, తపోధనుండును అగు నా మునినడుగుదము". లక్ష్మణుడిట్లు చెప్పఁగా విని రాముఁడు బకదాల్భ్యుని జూచుట కాశ్రమమునకుఁ బోయెను. ఆశ్రమమునకు వెళ్ళి యా బకదాల్భ్యమునికి నమస్కరించినంతనే అతడు రామా! ఎందులకై యిటకువచ్చితి" వని యడుగ నతఁడిట్లు సమాధాన మిచ్చెను. "ఓ మహామునీ ! నీ అనుగ్రహము వలన లంకా పట్టణమును జయించుటకు వానరసేనలతోఁ గూడి సముద్రతీరమునకు వచ్చియుంటిని. నీ యనుగ్రహము వలన సముద్రమును దాఁటవలయును. కాని అది దాఁట నలవికాకున్నది. కనుక నాయందు అనుగ్రహించి తగిన యుపాయమును సెలవిమ్ము". అని రాముఁడు విన్నవింపఁగా బకదాల్భ్యముని అతనితో నిట్లు చెప్పెను. "ఓ రామా! సమస్త దుఃఖనాశకమగు వ్రతము నొకదానిని జెప్పెదను దానిని స్థిరచిత్తము కలిగి చేయవలెను. మానవులకుఁ గోరికల నిచ్చువాడు విశ్వకర్మ, ఆ దేవుని నీవు తప్పక పూజించినట్లయిన జయము కలుగును. నిశ్చయముగా నీయగాథమగు సముద్రమును నీ సేనతోఁ గూడ దాఁటఁగలవు. ఆ వ్రతమునకుఁ జెప్పిన విధితో లక్ష్మణునితోఁ గూడిన వాఁడవై పూజింపుము. విశ్వకర్మవంశమునఁ బుట్టినవాఁడును. సత్యశీలుడును, విశ్వకర్మ వ్రతమునం దెడతెగని యాసక్తి కలవాఁడును. అగునలుని బూజించి యడుగుము. ఆ వ్రత విధానమంతయు నతఁడే నీకుఁ జెప్పును". రాముడు ఆ వాక్యములను వినినవాఁడై త్వరగా సాగరతీరమునకు జేరి తమ్ముఁడగు లక్ష్మణునితోఁగూడి నలుని యొద్దకు వెళ్ళి యతనికి నమస్కరించి యిట్లు పలికెను. "వ్రతనిష్ఠాపరుఁడవగు నో నలుఁడా ! నీ యొక్క ప్రసిద్ధి బకదాల్భ్య మహర్షికి తెలియును. ఆ మహానుభావుఁడు చెప్పఁగా నేను విని తెలిసికొంటిని నేనిప్పుడు

శాస్త్రోక్తముగా విశ్వకర్మ వ్రతమును జేయఁదలంచితిని నీ వచటి పురోహిత కార్యమును నెఱవేర్చి కథలను జెప్పవలయును". నలుఁడును మంచిదని యంగీకరింపగా రాముఁడు సంతోషించి పరమభక్తితో వ్రతము నాచరించెను. వ్రతాంతమున నా ప్రసాదమును రాముఁడు భక్తితో భుజించెను. లక్ష్మణుడును వానరులందరును భక్తి యుక్తియై భుజించిరి. ఆ మహిమ వలన రాళ్లన్నియు జలమునందు నిలుచుచున్నవే కాని యే మాత్రము మునుంగవయ్యెను ఈ ప్రకారము వంతెన తయారగుచుండెను. రాముడు ఆ కట్టడమును జూచి యాశ్చర్యము నొందెను. లక్ష్మణుఁడును సంతోషించెను, వానరులు అందఱును దానిని గదలింపఁబూనిరి. అటులఁ గదలించుచున్న వానరసేనలకు ఆ సేతువు కొంచెమైనను గదలక హేమవత్పర్వతమువలె గట్టిగానుండెను. అప్పుడు హనుమంతుఁడు తన తోకతోఁ జుట్టి మూడు గడియలకాలము లాగి చూచెను. తన శక్తి నంతయుజూపి లాగినను వంతెన కదలకుండుటచే హనుమంతుఁడు సిగ్గుపడి తనంతట తానే యా నలునియొక్క పాదములకు సాష్టాంగ నమస్కారము చేసెను.

ఈ వ్రతఫలముచేత రాముఁడు సముద్రముదాటి రావణుని యుద్ధము నందు జంపి, లంకాపట్టణమును జయించి, సీతను దీసికొనివచ్చెను. మహరులచేఁ జెప్పఁబడిన యీ పరమరహస్యము నెవఁడు వినుచున్నాఁడో యతఁడు విశ్వకర్మ యనుగ్రహమువలనఁ బాపరహితుండును, బరిశుద్ధుఁడును, అగుచున్నాడు. అతనికి బుత్రపౌత్రాభివృద్ధి కలుగును సుఖము, జయము కలవాఁడగును జీవితాంతమున సత్యలోకమున విశ్వకర్మ యొక్క సాయుజ్యమును బొందును.

ఇతి శ్రీ విశ్వకర్మసంహితాయాం సృష్టిఖండే

విశ్వకర్మకథాయాం పంచమోఽధ్యాయః ॥

## షష్ఠోఽధ్యాయః

ఓమునిశ్రేష్ఠులారా ! వినుఁడు ద్వాపరయుగాంతమున యదు వంశమున శ్రేష్ఠుడగు కృష్ణుడు ఉదయించెను. అతఁడు రూపవంతుఁడును, యుక్తి యుక్తముగా మాటలాడువాఁడును, ప్రజ్ఞావంతుఁడును, యుక్తి శాలియును, సమస్తము నెఱిఁగినవాఁడును అయియుండెను. ఒకనాఁడు కాలయవనుఁడును, మగధ దేశాధిపతియగు జరాసంధుఁడు ఆకస్మికముగా దాడిచేసి మధురాపురమును ముట్టడించిరి. అప్పుడు కృష్ణుడు "ఈ భయము తొలఁగుట యెట్లు ? నే నిప్పుడేమి చేయుదును ?" అని తన మనస్సున నిట్లు ధ్యానించెను, "మహాదేవుఁడవగు నో విశ్వకర్మా ! నీవే యీ సమస్త లోకములకు అధిపతివి. నీవే తండ్రివి సృష్టింపను సంహరింపను కర్తవు. అన్ని కోరికల నిచ్చువాడవు ! సమస్త చరాచరాత్మకమైన ఈ మూడు లోకములను సృష్టించి రజస్తమోయుతములై యొప్పు అనేక రూపములతో నుందువు. జగన్నాథుఁడవగు ఓ దేవా ! శత్రుబాధితుఁడనై యున్న నన్ను రక్షింపుము. ఈ మూఁడు లోకముల యందును నీవు దక్క వేఱొక దైవమును నేను చూచియుండలేదు''. ఇట్లు మాటిమాటికి నమస్కరించుచు బంధువర్గముతో గూడి విధ్యుక్తముగా విశ్వకర్మ వ్రతము నాచరించెను.

విశ్వకర్మ సంతోషించిన వాడై శత్రురాజుల కసాధ్యమై యొప్పునట్లు అంబుధిమధ్య నొక పట్టణమును రచించి దానికి ద్వారకయని పేరిడెను. అది విశ్వకర్మ నిర్మితమగుటచే శిల్ప విజ్ఞాన నైపుణ్యము మిక్కిలి చూడఁదగియుండెను. రాజవీధులు తీర్చి ముంగిళ్ళచే నలంకరింపఁబడి వాస్తు శాస్త్రోక్తముగా నిర్మింపబడిన గృహములను, కల్పలతల తోడ నుద్యానములను, విచిత్రములగు నుపవనములును, కలిగి శోభిల్లుచుండెను

చలువరాలతో రచితములయిన కోటబురుజులు, గోపురములు, బంగారు శిఖరములతో మెరయుచుండెను, వెండిచేత, నిత్తడిచేతఁ గూడ నిర్మింప బడియున్న అన్నశాలలు, అశ్వశాలలు మొదలగునవి సువర్ణ కలశములు బ్రకాశించుచుండెను. నగర గృహద్వార సమీపమున దేవతా గృహములు చేతను, పద్మరాగాది మణులచేతను, మహామరకతములతో నొప్పు గృహములచేతను, శ్రీకృష్ణ మందిరములచేతను వెలయుచుండెను.

ఆ విశ్వకర్మ భగవానుని యొక్క అనుగ్రహము వలన ద్వారకాపురము నందలి జనులెల్లరు వేణువేఱుగా అందముగా అలంకరింపబడిన గృహముల చేతను, నవనిధులచేతను అణిమాద్యష్టసిద్ధులచేతను, దివ్యలోక పుష్ప మాలికల చేతను, దివ్యగంధములచేతను, దాన దాసదాసీజనములచేతను ప్రకాశించుచుండిరి. అందువలననే పెద్దలయినవారు విశ్వకర్మను పూజించుచున్నారు. గృహస్థులలో నెవరు శుభములును, ఆయుష్యమును ఆపేక్షించుచున్నారో వారును విశ్వకర్మనే పూజించుచున్నారు. గొప్పదయిన సముద్రమునకు నడుమ నున్నదియును, భేదింపనలవి కానిదియును, నీటిపైనను, ఆకాశమునను, భూమిపైనను, నడచునట్టి రథములచే నిండినదియును, అనేకములయిన యేనుఁగులును, గుఱ్ఱములును, సేనయును గలిగి యొప్పుచున్నదియును పదిరెండు యోజనముల నిడివి గలిగి అంతయే వెడల్పున చౌకముగా నున్నదియును ఆయుధాగారములు కలదియును, మహాభయము గలిగించునదియును అగు ద్వారకాపురిని జూచి కృష్ణుని శత్రువులెల్లరు నాపురంబున గెలువ రేయింబవళ్ళు ఆలోచించి విఫల మనోరథులైరి.

ఓ మహర్షులారా! విశ్వకర్మ తన యేవురు సుతులతో సహా ద్వారకాపుర జనులందఱిచే నిరంతరమును పూజింపబడుచున్నాడు. శ్రేష్ఠమయిన శ్రీ విశ్వకర్మ యొక్క కథను పఠించినను, వినినను విశ్వకర్మ యొక్క దయవలన

నాతఁడు పాపరహితుఁడై పుణ్యవంతుఁడగుచున్నాడు. దరిద్రుడు ఈ కథను వినిన ధనవంతుడగును, బంధనాలయమున నున్నవాఁడు బంధనము నుండి విడువఁబడును, భయమును బొందియున్నవాడు ఇది వినినచో భయరహితుండగును ఇందు సంశయము లేదు.

ఇతి శ్రీ విశ్వకర్మసంహితాయాం సృష్టిఖండే
విశ్వకర్మకథాయాం షష్ఠొఽధ్యాయః ॥

## సప్తమోఽధ్యాయః

ఓ మునిశ్రేష్ఠులారా ! సచ్చిదానంద స్వరూపుఁడును. జగద్గురుండును అగు శ్రీ విశ్వకర్మ భగవానుని యొక్క శ్రేష్ఠమయిన కథను జెప్పుచున్నాను, శ్రద్ధగా వినుఁడు. పూర్వము ప్రమంగదుఁడను రాజొకడుండెను. అతడు ప్రజలను తన బిడ్డలవలె పాలించెను. మరియు ధర్మనిష్ఠుఁడును సమస్త కార్యములను నిశ్చల చిత్తముతో జేయువాఁడును అయియుండెను. ఆ రాజునకు పద్మములవంటి కన్నులు గలదియు, పార్వతివలె బతివ్రతా శిరోమణియు, జ్ఞానవతియు, ధర్మకర్మ వ్రతోపయుక్తయు నగు కమల యను పేరు గల భార్యయుండెను. ఆ రాజునకు అనారోగ్యము చేయగా అనేక ఔషధములను గొప్ప గొప్ప వైద్యులనేక విధములుగా నిత్య ముపయోగించు చుండినను కొంచెమయినను నుపశమించియుండలేదు. అందువలన నతడు మిక్కిలి వ్యాకులచిత్తుడై యుండెను. ఇట్లు వ్యాధిచే దుఃఖము నొందుచున్న భర్తను జూచి మహాపతివ్రతయగు నతని పట్టపుదేవి యిట్లు పలికెను. "ఓ రాజా ! మహాజ్ఞానియు, నుపమన్యు నామధేయుఁడు నగు మన పురోహితుఁడు ఒకప్పుడు నేత్ర వ్యాధితో బీడింపబడుచు నెడతెగని యంధత్వమున శ్రమనొందుచున్న నన్ను జూచెను. మహాజ్ఞానియగు నా పురోహితుఁడు తన యొక్క జ్ఞాన దృష్టిచే నా జాడ్యము నెఱింగి నాకు

శమనోపాయమును జెప్పెను. ప్రత్యేక స్థలమున ప్రతి యమావాస్య యందు శ్రీ విశ్వకర్మ వ్రత మాచరించగా నానేత్ర వ్యాధి నివారించినది. అది మొదలు నే నత్యానందము నొందుచున్నాను. ఆ పురోహితుడు నియమ దినమున తన యితర కర్మముల నన్నిటిని వదలి బ్రహ్మచర్య నిష్ఠతో విధిపూర్వకముగా విశ్వకర్మ పూజావ్రతము నొనరించును. ఆతడా ఆ వ్రతము యొక్క ప్రభావముచే దివ్యదృష్టి గల వాఁడయ్యెను మిగుల ముదిమి నుండియు గొంచమయినను దృష్టిలోపము లేకుండెను. ఓ మహారాజా ! దీనురాలనగు నా ప్రార్థనము నంగీకరించి దీన రక్షకుఁడగు భగవాన్ విశ్వకర్మను శరణము వేఁడుము, ఆయన యొక్క కృపచే నీవు వ్యాధి నుండి విముక్తడవగుదువు".

"ఓ ప్రియురాలా! నీవు చెప్పినది సమంజముగనే యున్నది, వినినంతనే నాకు సంతోష మొదవినది. విశ్వకర్మ యొక్క పూజను వ్రతమును, ఆచరించి తన్మాహాత్మ్యమువలన ఈ రోగమునుండి నిశ్చయుముగా విముక్తినందగలను. దీనినెప్పుడు తలపెట్టుదునాయని మనమున నుల్లాసము కలిగినది. అది మొదలుకొని యా రాజు ప్రతి దినమును విశ్వకర్మను పూజించి నమస్కరించి భోజనము చేయుచుండెను. శుభతిథిగల దినమున సమస్త రాజ్య కార్యములను వదలి బ్రహ్మచర్య నియమముతో నేకాగ్రచిత్తము గలిగి విశ్వకర్మను ధ్యానించి పూజించి వ్రతము నాచరించుచుండెను.

విశ్వకర్మ భగవానుని పూజావ్రత ప్రభావముచేత ఆ రాజు యొక్క కుష్టువ్యాధి రహితమయ్యెను. అతని శరీరకాంతి మేలిమి బంగారువలె బ్రకాశించుచుండెను. తదుపరి సమస్త రాజభోగముల ననుభవించెను. అది మొదలా రాజు నియమిత దినమునందు విశ్వకర్మ వ్రతమును తన యావజ్జీవితకాలము నిశ్చల చిత్తముతో జేయుచు కేవలము విశ్వకర్మ చరణ పద్మముల వీడని భృంగరాజమయ్యెను. ప్రతి దినమునను శ్రీవిశ్వకర్మ

భగవానుని స్థిరచిత్తముతో నెవడు ధ్యానించుచున్నాడో అతడు సమస్త రోగములనుండి విముక్తుఁడగుచు నంతమున మోక్షమును పొందుచున్నాడు.

ఇతి శ్రీ విశ్వకర్మసంహితాయాం సృష్టిఖండే
విశ్వకర్మకథాయాం సప్తమో ధ్యాయః ॥

## అష్టమోఽ ధ్యాయః

ఓ ఋషులారా ! సమస్త లోకములయందు బ్రసిద్ధి గాంచిన శ్రీ విశ్వకర్మ యొక్క మాహాత్మ్యమును గూర్చి మీకు మరల నొక కథ చెప్పుచున్నాను వినుఁడు. కాశీ క్షేత్రమున నొక విశ్వకర్మ బ్రాహ్మణవంశీయుడుండెను, ఆయనకు సుగుణవతి యగు భార్యకలదు. ఆ దంపతులు స్వధర్మము నాచరించుచు చరితార్థమయిన సంతోషవృత్తితో మెలగుచుండిరి. ఆ బ్రాహ్మణుడు మిక్కిలి బుద్ధిమంతుఁడును, స్వకర్మ నిపుణుడును, అయినను సంతృప్తికరమగు జీవనోపాయము లేక యెల్లప్పుడు మహావ్యాకులచిత్తుఁ డై యుండెను. ఇట్లు ప్రయత్న మొనర్చుచు నెన్నియో ప్రదేశములకు దిరిగి తిరిగి యన్నవస్త్రములకు మాత్రమే సంపాదించగలిగెను. కాని యంతకంటె నెక్కువను బొంది యుండలేదు. ఆ బ్రాహ్మణ శ్రేష్ఠునికి సంతతి లేనందున నతని భార్య యెల్లప్పుడును మేము వార్ధకావస్థయం దెట్లు జీవించ గలుగుదుమోయని మిగుల దుఃఖించుచుండెను. ఈ తీరున విచారగ్రస్తులై యున్న యీ దంపతులను గాంచిన యొక పొరుగింటి బ్రాహ్మణుఁ డిట్లు చెప్పడు.

“ఓ ఆచార్యుడా ! ఇంతకంటె నెక్కడ నేము చేయుట కిట్లధికముగా దిరుగుచున్నావు ? అన్ని విధముల నీవు బొత్తిగా దెలియని వాడవని నేను దలంచుచున్నాను. కనుక నీవు వ్యర్థములైన యుపాయములన్నింటిని వదిలి దయామయుండగు విశ్వకర్మను తప్పక శరణు వేఁడుము. ఓ శ్రేష్ఠుడా !

విశ్వకర్మ ప్రభునియొక్క దయవలన నీకిష్ట సిద్ధియగును, సమస్త దుఃఖముల నశింపజేయుటకు విశ్వకర్మ భగవానుఁడు కాక సమర్థుడు ఇంకొక వేలుపు లేడు. కనుక నీవు సమస్త కర్మములను వదలి శుభదినమున జితేంద్రియుఁ డవై యుపవాస మొనర్చి భక్తితో విశ్వకర్మ వ్రతమును ఆచరించి ఆ స్వామి కథను విని ప్రసాదము భుజించుము.

మహాత్ముఁడగు నా బ్రాహ్మణుడిట్లు చెప్పగా విని యా శిలాచార్యుడు జ్ఞానము కలవాఁడయ్యెను, అప్పుడే విశ్వకర్మ తన హృదయమున బ్రకాశించెను. అది మొదలు ఆ విశ్వ బ్రాహ్మణుడు ఎల్లప్పుడు స్వధర్మ తత్పరుఁడుకు విశ్వకర్మ పదకమల సేవా పరతంత్రుఁడును అయి యుండెను. పతివ్రతయగు నతని భార్యయు అన్యోపాయములను విడిచి విశ్వకర్మ యొక్క గుణములయందాసక్తితో ఆ స్వామిని మిగుల భక్తితో బూజించుచుండెను. ఆ దంపతులు వ్రతము చేసుకొను దినమునందు ఉపవసించి వ్రతాచరణ యుక్తులై విశ్వకర్మను పూజించి తత్ కథా శ్రవణ మొనర్చిరి. ఆ వ్రత ప్రభావమువలన ధనమును పుత్రులను గలవారైరి. ఆ బ్రాహ్మణోత్తముఁడు నిత్యము చరితార్థమైన ప్రవర్తనము కలవాఁడైయుండెను. వృత్తి కర్మమునందు నిపుణఁడై మంచి స్థితిలో నుండెను.

ఆ దంపతులకు మంచి ప్రవర్తనము కలవారును, నిత్యకర్మతత్పరులును, గుణవంతులును, విద్వాంసులను, మాతాపితృసేవాసక్తులును, అగు కుమారులు జన్మించిరి. ఈ ప్రకార మా దంపతులు సర్వదేవతలలో శ్రేష్ఠుడగు విశ్వకర్మ యొక్క వ్రత ప్రభావమున సమస్త సౌఖ్యముల ననుభవించిరి. ఏ మానవుడు ఈ ప్రకారముగా భక్తియుతమగు నంతః కరణముతో విశ్వకర్మ పూజనమును చేసి కథను వినుచున్నాడో అతఁ డీలోకమున పుత్ర పౌత్రాదులతోడను. మహైశ్వర్యములతోను, ఎడతెగని

సుఖము ననుభవించుచున్నాడు.

ఇతి శ్రీ విశ్వకర్మసంహితాయాం సృష్టిఖండే
విశ్వకర్మకథాయాం అష్టమోఽధ్యాయః

## నవమోఽధ్యాయః

అంతట మునులు ఇట్లు ప్రశ్నించిరి "ఇంతటి గొప్ప మాహాత్యము గల వ్రతమును ఎప్పుడెప్పుడు, ఏయే ప్రదేశములలో ఆచరించవచ్చునో తెలయజేయు" మని కోరిరి. సూత మహర్షి సంతోషించినవాడై ఈ విధముగా తెలియచేసెను.

"మునులారా ! ఈ వ్రతమును సమస్త శుభకార్యములయందును ప్రతి మాసమున అమావాస్య దినముననను చైత్ర శుద్ధ పంచమి, పూర్ణిమా, శ్రావణ శుద్ధ పూర్ణిమా, కార్తీక శుద్ధ ఏకాదశి, మార్గశిర శుద్ధ దశమి మున్నగు శుభతిథులయందు యధావిధిగా శాస్త్రోక్తముగా ఆచరింపవచ్చును. మరియు ఈ వ్రతమును పుణ్య క్షేత్రముల యందును, నదీతీరములలోను, దేవాలయముల యందును, గృహములలోను, సమస్త శుభకార్యముల యందును, గృహప్రవేశ, వివాహ, అవతార శుభదినముల యందును మిక్కిలి సంతోషముగా భక్తియుతులై యథావిధిగా సంపూర్ణముగా వ్రతము చేసిన మనుష్యుడు సకల దుఃఖముల నుండి విముక్తుడగును.

ఈ వ్రతమును సమస్త వర్ణముల వారు ఆచరింపవచ్చును. స్త్రీలు కూడ ఆచరింపవచ్చును. యజమాని బంధువులతోను, విశ్వకర్మ బ్రాహ్మణులతోను వేద మంత్రములతోను, వివిధ మంగళ వాద్యములతోను, నృత్య గీతాదులతోను, పత్నీ యుతముగా స్నానము చేసి యథావిధి నిత్య కర్మలను నిర్వర్తించుకొని "ఓ విశ్వకర్మ ప్రభో ! నీ వ్రతమును ఆచరించెదను" అని సంకల్పము చేసుకొని నవవిధాలంకారమయ మయిన పూజా గృహమును

గోమయముతో అలికి వ్రతమందు చెప్పిన విధముగా బియ్యపు పిండితో గాని, గోధుమ పిండితో గాని అయిదు పద్మములు గల ముగ్గు వేసి పసుపు కుంకుమరితో అలంకరించి ఆ పైన శ్రీ విశ్వకర్మ పూజా పీఠమునుంచి కొత్త తుండుగుడ్డ పరచి యధాశక్తి బియ్యము నుంచి ఆపై శాస్త్రోక్తముగా దేవుని కలశమును శ్రీ విశ్వకర్మ ప్రతిమను గాని, చిత్రమును గాని ప్రతిష్ఠింపవలయును. కలశముపై కొబ్బరికాయను తమలపాకుల మధ్య పంచ పల్లవముల మధ్య ప్రతిష్ఠించి పైన రవిక గుడ్డను ఉంచవలెను.

ముందుగా గణపతిని పూజించి తర్వాత కలశమును పూజించవలెను. పిమ్మట పీఠమును పూజించవలెను. అనంతరము కలశమును పంచ పల్లవములతోను పంచరత్నములతోను జలముతోను నింపి వరుణుని పూజింపవలయును తదుపరి మనుబ్రహ్మను మయబ్రహ్మను త్వష్ట బ్రహ్మను శిల్పి బ్రహ్మను దైవజ్ఞ బ్రహ్మను పూజింపవలయును. కలశమునకు ఎదుట కొంత తూర్పుగా ఉండునట్లు 27 తమలపాకులు పరచి పంచ బ్రహ్మలకు త్రిమూర్తులకు నవగ్రహములకు అష్ట దిక్పాలకులకు పృధ్వికి ఊర్ధ్వ పురుషునికి "స్థాపయామి" అని చెప్పినపుడు ఆకు నందు అక్షతలు పోకచెక్కలు పసుపు కొమ్ము ఖర్జూరపు కాయ చిల్లర నాణెములు ఉంచు చుండవలెను. సర్వ దేవతలను షోడశోపచారములతో పూజించి నైవేద్యము సమర్పించి నమస్కరించి పూజా ద్రవ్యమును శిరస్సుపై ధరించవలెను. తదనంతరము సమస్త వేదములందు చెప్పబడిన "య ఇ మ" ఇత్యాది పదునాలుగు ఋక్కులను పఠించి " ఓం శ్రీ గాయత్రీ విశ్వకర్మణే నమః" అను ద్వాదశాక్షరి మహామంత్రముచేత శ్రీ విశ్వకర్మను మన్వాది పంచ బ్రహ్మలను దేవీ పంచకమును ఆవరణములను ఆవరణ దేవతలను అష్ట సిద్ధులను నవనిధులను షోడశమాతృకలను ఇత్యాదిగా భక్తి యుక్తముగా

పూజించవలెను.

శ్రీ విశ్వకర్మ యొక్క సువర్ణ ప్రతిమనైనను, శిలామూర్తినయినను నిర్మించి షోడశోపచారములఁ బూజింప వలయును, తరువాత నైవేద్యమును భక్తితో నర్పించవలయును, ఆ నైవేద్యమును వారి వారి శక్తి కొలది శుద్ధాన్నమును గోక్షీరము దధి, ఆజ్యము, చక్కెర, గోధుమరవ్వ ఇవి యన్నియును కలిపి నివేదించవలయును.

పిమ్మట మిగుల భక్తితో బ్రాహ్మణులు, బంధువులు, స్నేహితులు, మున్నగువారితోసహ కథాశ్రవణమును చేయవలయును. అనంతరము బ్రాహ్మణులకు దక్షిణ నొసంగవలయును. సమస్తమైన వారికి ప్రసాదమునిచ్చి తానును దీసికొనవలయును. తదుపరి బంధుమిత్రాది వర్గమునకును, బ్రాహ్మణులకును భోజనము నిడవలయును.

ఈ విధముగా మిక్కిలి సంతోషముగా శ్రీ విశ్వకర్మ పూజ యధావిధి సంపూర్ణముగా చేసిన మనుష్యుడు సకల దుఃఖములనుండి విముక్తుఁడై యిహలోక సౌఖ్యముల నన్నిఁటి ననుభవించు చున్నాడు. అనంతరమున నతఁడు మోక్షప్రాప్తు డగుచున్నాడు.

ఇతి శ్రీ విశ్వకర్మ సంహితాయాం సృష్టిఖండే

విశ్వకర్మ కథాయాం నవమోఽధ్యాయః

# శ్రీ వాస్తోష్పతి స్వరూప విశ్వకర్మ పూజా విధానము

ఆచమ్య... ప్రాణానాయమ్య.... ఏవం । ప్రీత్యర్థం । మమ నూతన స్థలే । స్వగృహే స(హ) కుటుంబస్య, సపరివారస్య ప్రశాన్తాయురారోగ్యైశ్వరా భివృద్ధ్యర్థం । మమ పుత్ర పౌత్రాది సహిత్యపరంపర అస్మిన్ స్థలే । గృహీ చిరకాల నివాస యోగ్యతాసిద్ధి ద్వారా సర్వ సంకట నానావిధ రోగాది సర్వోపద్రవ శాన్తి సంపదాఽయురారోగ్య ధనధాన్య ద్విపద చతుష్పద పుత్రపౌత్రాద్యాభివృద్ధి పూర్వక సువర్ణ రజిత, తామ్రతువు సీస, కాంస్య లోహ పాసాణాద్యష్టశల్యమేదినీ దోష, ఆయావ్యయా ద్యన్యథా భవన నానావిధ హింసాదోష పరిహార ద్వారా ఏతద్గృహ ఓఏత్రావచ్ఛిన్న భూమ్యాధిష్ఠిత దేవతోపరోధ జనితోపసర్గ నివృత్తి పూర్వక మండపాధిస్థత వాస్తు పురుషప్రీతయేఽత్ర కరిష్యమాణ నిత్యనైమిత్తిక కామ్య కర్మణానుస్య వాస్తోశ్చ శుభసిద్ధిద్వారా సర్వస్థల । గృహవిశుద్ధమేతో యథామిళితోపచార సంభారై ఏకాశీతిపద పర9మ)శాయి । చతుష్షష్టి పద మాండూక । ఏకోన పఞ్చాశత్పాదస్థంశిల వాస్తు మండల పూజనమహం కరిష్యే ॥ ఇతి సంకల్ప్య । వేద్యుపరి నూతన వస్త్ర మాస్తీర్య । తండులాన్ నిక్షిప్య । స్థండిలం పరికల్ప్య ॥

(ముందుగా వస్త్రమును పరచి 2 × '2' అడుగుల వైశాల్యములో బియ్యము పోసి (సమస్త గృహకర్మల యందు ఏకాశీతి పద / పర(మ)శాయ మండలము, సమస్త యజ్ఞ యాగాది ప్రతిష్ఠాదుల యందు చతుష్షష్టి పద మండూక మండలమును సమస్త జీర్ణోద్ధారణ వాస్తుకర్మలయందు ఏకోన పంచాశత్పద స్థండిల వాస్తు మండలమును లిఖించవలెను.

ఇచ్చట ప్రస్తుతము ఏకాశీతి / పర(మ)శాయి పద వాస్తు మండలము వ్రాయుట జరిగియున్నది. తత్ర ॥ ఓం అతలాది సప్తలోకేభ్యో నమః ।

ఓం మండూకాది పరతత్వాన్త పీఠ దేవతాభ్యో నమః ।

ఓం అణిమాద్యష్ట సిద్ధ్యై నమః । ఓం సర్వకామ సిద్ధ్యై నమః

ఇతి నవపీఠశక్తీః సంపూజ్య । సర్వజ్ఞాన క్రియావ్యక్త కమలాసనాయ

యోగపీఠాయ నమః । ఇతి పీఠనాయకం సంపూజ్య । ఈశానాది కోణ చతుష్కే ఔదుంబర శంకుచతుష్టయం ప్రాగ్దక్షిణ క్రమేణ లోహ శంకుచతుష్టయం రోపయేత్ ॥ సురూపాం సుభూషితాం స్త్రీ రూపాం పృధ్వీం ఓం ధరాయై నమః ॥

శ్లో॥ విశన్తు భూతలేనాగా, లోకపాలాశ్చ సర్వతః ।
మణ్డపేత్రావతిష్ఠన్తు, ఆయుర్బల కరాస్సదా ॥

ఇత్యనేన ఈశానాది ప్రాద్దక్షిణ క్రమేణ శంకుదేవతాః ప్రార్ధనం కుర్యాత్ ॥ తతః ఈశానాది కోణ చతుష్కే పార్శ్వారోపన క్రమేణ ॥

శ్లో॥ రుద్రేభ్యశ్చైవ సర్వేభ్యో, యేచాన్యే తత్సమాశ్రితాః ।
బలాతేభ్యో ప్రయచ్ఛామి, గృహ్ణన్తు సతతోత్సుకాః ॥
ఇతీశాన్యాం మాషభక్తబలిం దద్యాత్ ॥

శ్లో॥ అగ్నిభ్యోప్యధ సర్వేభ్యో యేచాన్యే తత్సమాంశ్రితాః ।
తేభ్యో బలింప్రయచ్ఛామి పుణ్యమోదన ముత్తమం ॥
ఇత్యాగ్నేయే మాషభక్తిబలిం దద్యాత్ ॥

శ్లో॥ నైరృత్యాధిపతిశ్చైవ నైరృత్యాం యేచ రాక్షాసాః ।
బలింతేభ్యో ప్రయచ్ఛామి సర్వే గృహ్ణోన్తు మంత్రితం ॥
ఇతినైరృత్యాం మాషభక్తబలిం దద్యాత్ ॥

శ్లో॥ వాయవ్యాధిపతిశ్చైవ వాయవ్యాంయేచ రాక్షసాః ।
బలింతేభ్యోప్రయచ్ఛామి, పుణ్యమోదన ముత్తిమమ్ ॥
ఇతివాయవ్యా మాషభక్తబలిం దద్యాత్ ॥

తతో వాస్తుపీఠే కుంకుమాదినా, కనకశలకయా, రత్న రజత ఫలపుష్పాణా మన్యత మేనవా పశ్చాదారంభాః, ప్రాగంతాః ప్రాక్పశ్చియాయతా ద్విద్వ్యంగుళాం రేఖాః కుర్యాత్ ॥

శ్లో॥ ప్రాగగ్రాదశరేఖాశ్చ ఉదగగ్రాలేఖాదశ ।
ఏకాశీతి పదం వాస్తు, గృహకర్మణి శస్యతే ॥

బంగారుకడ్డి (లేక) దర్భకూర్చ, పసుపుకొమ్ము లేక చివరగా శుభ ప్రదమైన / (తూర్పు రేఖలు) పడమర నుండి తూర్పునకు అంతమగునట్లుగా 10 రేఖలు దక్షిణము నుండియు, (ఉత్తర రేఖలు) / దక్షిణము నుండి ఉత్తరమునకు అంతమయ్యేటట్లుగా పశ్చిమమున ప్రారంభించి 10 రేఖలుగా 81 గదులుగా ఏకాశీతి పద మండలమును లిఖించవలెను.

శ్లో॥ ప్రాగగ్రా నవరేఖాశ్చ, ఉదగగ్రారేఖానవ ।
చతుష్షష్టి పదంవాస్తు, దేవీ కర్మణి శస్యతే ॥

(తూర్పురేఖలు) పడమర నుండి తూర్పునకు అంతమయ్యేటట్లుగా 9 రేఖలు దక్షిణము నుండి ప్రారంభించవలెను. (ఉత్తర రేఖలు) దక్షిణము నుండి ఉత్తరమునకు అంతమయ్యేటట్లుగా పశ్చిమమున ప్రారంభించి 9 రేఖలుగా 64 గదులుగా లిఖించవలెను.

శ్లో॥ ప్రాగగ్రా అష్టరేఖాశ్చ, ఉదగగ్రా రేఖాష్టకమ్ ।
ఏకోనపఞ్చాశద్వాస్తు, జీర్ణోద్ధారణిశస్యత్ ॥

(తూర్పు రేఖలు) పడమర నుండి తూర్పునకు అంత్యమయ్యేటట్లుగా (8) అష్టరేఖలు దక్షిణము నుండి ప్రారంభించవలెను. (ఉత్తర రేఖలు) దక్షిణము నుండి ఉత్తరమునకు అంతమయ్యేటట్లుగా పశ్చిమమున ప్రారంభించి అష్ట (8) రేఖలుగా 49 గదులుగా లిఖించవలెను. దీనిని స్థండిల వాస్తుమండలమందురు.

**(దక్షిణమున మొదలుకొని ఉత్తరమునకు సాగుతూ)**

## పడమర నుండి తూర్పుగా వ్రాసిన రేఖల దేవతలు

శ్లో॥ శాన్తా యశోవతీ కాన్తా, విశాలాప్రాణవాహినీ
సతీచ సుమతానందా, సుభద్రాసురథాస్థితాః ॥

1. ఓం శాంతాయై నమః – శాన్తామావాహయామి ।
2. ఓం యశోవత్యై నమః – యశోవతీ మావాహయామి ।
3. ఓం కాంతాయై నమః – కాన్తాయావాహయామి ।
4. ఓం విశాలాయై నమః – విశాలాయావాహయామి ।

5. ఓం ప్రాణవాహిన్యై నమః - ప్రాణవాహినీ మావాహయామి ।
6. ఓం సత్యై నమః - సతీ మావాహయామి
7. ఓం సుమత్యై నమః - సుమతీ మావాహయామి
8. ఓం నందాయై నమః - నందా మావాహయామి ।
9. ఓం సుభద్రాయై నమః - సుభద్రా మావాహయామి ।
10. ఓం సురధాయై నమః - సురథామావాహయామి 7

**(పడమర మొదలుకొని ఉత్తరమునకు సాగుతూ)**

## దక్షిణము నుండి ఉత్తరముగా వ్రాసిన రేఖల దేవతలు

శ్లో॥ హిరణ్యా సువ్రతా లక్ష్మీ విభూతిర్విమలా శ్రియా ।
జయకాలా విశోకాచ తథేయైరశిమాస్మృతా ॥

1. ఓం హిరణ్యాయై నమః - హిరణ్యాయావాహయామి ।
2. ఓం సువ్రతాయై నమః - సువ్రతా మావాహయామి ।
3. ఓం లక్ష్మ్యై నమః - లక్ష్మీ మావాహయామి ।
4. ఓం విభూత్యై నమః - విభూతి మావాహయామి ।
5. ఓం విమలాయై నమః - విమలా మావాహయామి ।
6. ఓంశ్రియాయై నమః - శ్రియామావాహయామి ।
7. ఓం జయాయై నమః - జయామావాహయామి ।
8. ఓం కాలాయై నమః - కాలామావాహయామి ।
9. ఓం విశోకాయై నమః - విశోకామావాహయామి ।
10. ఓం ఇడాయై నమః - ఇడామావాహయామి ॥

ఓం రేఖా దేవతాయై నమః । లమిత్యాది పంచోపచార పూజాం కుర్యాత్॥ (వాస్తోశ్చతురశ్రం శరీరం దేవా అక్రమ్యస్థితా ఇతి, తత్తదేవపదేచ తత్తద్దేవం నావాహయేత్ ॥)

1. ఈశానకోణైక / రక్తవర్ణ వాస్తోశ్శిరసి
   ఓం శిఖినే నమః । శిఖిన మావాహయామి - స్థా॥పూ॥

2. తద్దక్షిణైక పీతవర్ణ పదే వాస్తోర్దక్షిణ నేత్రే
ఓం పర్జన్యాయ నమః - పర్జన్యమావాహయామి ।
3. తద్దక్షిణ పీతవర్ణ పదద్వయే వాస్తోర్దక్షిణశ్రోత్రే
ఓం జయంతాయ నమః - జయంత మావాహయామి ॥
4. తద్దక్షిణ పీతవర్ణ పదద్వయే వాస్తోర్దక్షిణాంశే
ఓం కులిశాయుధాయ నమః - కులిశాయుధ మావాహయామి ॥
5. తద్దక్షిణ రక్తవర్ణ పదద్వయే వాస్తోర్దక్షిణ బాహౌ
ఓం సూర్యాయ నమః - సూర్యమావాహయామి ॥
6. తద్దక్షిణ శుక్లవర్ణ పదద్వయే వాస్తోర్దక్షిణ బాహోవేవ
ఓం సత్యాయ నమః - సత్యమావాహయామి ॥
7. తద్దక్షిణ కృష్ణవర్ణ పదద్వయే వాస్తోర్దక్షిణ కూర్పరే
ఓం భృశాయ నమః - భృశమావాహయామి ॥
8. తద్దక్షిణోపరి స్థితైక నీలవర్ణ పదే వాస్తోర్దక్షిణ ప్రబాహౌ
ఓం ఆకాశాయ నమ ః - ఆకాశమావాహయామి ॥
9. తద్దక్షిణ ధూమ్రవర్ణ ఆగ్నేయ కోణపదే - వాస్తో / దక్షిణ ప్రబాహోవేవ
ఓం వాయవే నమః - వాయుమావాహయామి ॥
10. తత్పశ్చిమైక రక్తవర్ణపదే / వాసో ర్దక్షిణ మణిబన్ధే
ఓం పూష్ణే నమః - పూషాణ మావాహయామి ॥
11. తత్పశ్చిమ శ్వేతవర్ణ పదద్వయే । వాస్తో ర్దక్షిణ పారేశ్వ
ఓం వితథాయ నమః - వితథ మావాహయామి ॥
12. తత్పశ్చిమ పీతవర్ణ పదద్వయే - వాస్తోర్దక్షిణ పార్శ్వేవ
ఓం గృహక్షతాయ నమః - గృహక్షత మావాహయామి ॥
13. తత్పశ్చిమ కృష్ణవర్ణ పదద్వయే - వాస్తోర్దక్షిణోశౌ
ఓం యమాయ నమః - యమ మావాహయామి ॥
14. తత్పశ్చిమ రక్తవర్ణ పదద్వయే - వాస్తోర్దక్షిణ జానౌ

ఓం గంధర్వాయ నమః - గంధర్వమావాహయామి ॥

15. తత్పశ్చిమ కృష్ణవర్ణ పదద్వయే వాస్తోర్దక్షిణ జంఘాయాం
ఓం భృంగరాజాయ నమః - భృంగరాజ మావాహయామి ॥

16. తత్పశ్చిమోపరిస్థితైక పీతవర్ణపదే - వాస్తోర్దక్షిణస్ఫిచి
ఓం మృగాయ నమః - మృగమావాహయామి ॥

17. తత్పశ్చిమ నైర్ఋత్య రక్తవర్ణ కోణపదే - వాస్తోర్పాదయోః
ఓం పితృభ్యోనమః - పితౄన్ ఆవాహయామి ॥

18. తదుత్తరైక రక్తవర్ణపదే - వాస్తోర్వామస్ఫిచి
ఓం దౌవారికాయ నమః - దౌవారి ఆవాహయామి ॥

19. తదుత్తర శుక్లవర్ణ పదద్వయే - వాస్తోర్వామ జంఘాయాం
ఓం సుగ్రీవాయ నమః - సుగ్రీవయావాహయామి ॥

20. తదుత్తర రక్తవర్ణ ఏదద్వయే - వాస్తోర్వామ జానౌ
ఓం పుష్పదన్తాయ నమః - పుష్పదన్తమావాహయామి ॥

21. తదుత్తర శుక్లవర్ణ పదద్వయే వాస్తోర్వామోరౌ
ఓం వరుణాయ నమః - వరుణా మావాహయామి ॥

22. తదుత్తర పీతవర్ణ పదద్వయే - వాస్తోర్వామ పార్శ్వే
ఓం అసురాయ నమః - అసుర మావాహయామి ॥

23. తదుత్తర కృష్ణవర్ణ పదద్వయే - వాస్తోర్వామ పార్శ్వేవ
ఓం శే(శో)షాయ నమః - శే(శో)షమావాహయామి ॥

24. తదుత్తరోపరి పీతవర్ణ స్థివైక పదే వాస్తోర్వామ మణిబన్ధే
ఓం పాపయక్ష్మణే నమః - పాపయక్ష్మాణ మావామయామి ॥

25. తదుత్తర రక్తవర్ణ - వాయవ్య కోణపదే వ్యాస్తోర్వామ ప్రబాహౌ
ఓం రోగాయ నమః - రోగమావాహయామి ॥

26. తత్రాగ్రైక రక్తవర్ణపదే - వాస్తోర్వాయ ప్రబాహోవేద
ఓం అహిర్బుధ్న్యా నమః - అహిర్బుధ్న్య మావాహయామి ॥

27. తత్ప్రాక్ రక్తవర్ణ పదద్వయే వాస్తోర్వామ కూర్పరే
ఓం ముఖ్యాయ నమః – ముఖ్యమావాహయామి ॥
28. తత్ప్రాక్ కృష్ణవర్ణ పదద్వమే – వాస్తోర్వామ బాహౌ
ఓం భల్లాటాయనమః – భల్లాట మావాహయామి ॥
29. తత్ప్రాక్ శ్వేతవర్ణ పదద్వయే – వాస్తోర్వామ బాహోవేవ
ఓం సోమాయ నమః – సోమమావాహయామి ॥
30. తత్ప్రాక్ కృష్ణవర్ణ పదద్వయే – వాస్తోర్వామాంసే
ఓం సర్పాయ నమః – సర్పమావాహయామి ॥
31. తత్ప్రాక్ పీతవర్ణ పదద్వయే – వాస్తోర్వామ శ్రోత్రే
ఓం ఆదితయే నమః – అదితి మావాహయామి ॥
32. తత్ప్రాకో పరిపీతవర్ణ స్థితైక పదే – వాస్తోర్వామనేత్రే
ఓం దితయే నమః – దితి మావాహయామి ॥
33. ఈశాన శిఖి పదాదధం – ధవళవర్ణ కోణైక పదే – వాస్తోర్ముఖే
ఓం అద్భ్యో నమః – అపః మావాహయామి ॥
34. ఆగ్నేయ వాయు పదాదధః ధవళవర్ణ కోణైకపదే – వాస్తోః ఉరస్యా
ఓం సావిత్రాయ నమః – సావిత్ర మావాహయామి
35. నైఋత్య పితృ పదాదధ కృష్ణవర్ణ కోణైకపదేవి – వాస్తోర్దక్షిణస్థనే
ఓం జయంతాయ నమః – జయంత మావాహయామి
36. వాయవ్య రక్తవర్ణ రోగపదాదథం కోణైక వదే – వాస్తోరో వామహస్తే
ఓం రుద్రాయ నమః – రుద్రమావాహయామి
37. మధ్యపదే – అద్భ్య పదాధస్థిత ఈశాన కోణైకపదే వాస్తోర్వక్షసి
ఆపవత్సాయ నమః – ఆపవత్స మావాహయామి ।
38. తద్దక్షిణ పదత్రయేషు వాస్తోర్దక్షిణస్థనే అర్యమ్ణే నమః
అర్యమ్ణ మావాహయామి
39. తద్దక్షిణ ఆగ్నేయ కోణైకపదే వాస్తోర్దక్షిణ హస్తే
ఓం సవిత్రే నమః – సవితార మావాహయామి ॥

40. తత్పశ్చిమ శ్వేతవర్ణ పదత్రయే – వాస్తోర్దక్షిణ జఠరే
ఓం వివస్వంతాయ నమః – వివస్వంత మావాహయామి

41. తత్పశ్చిమ నైర్ఋతి కోణైక పదే – వాస్తోర్వృషణయోః
ఐ విభుదాధిపాయయ నమః – విభుదాధిపతి మావాహయామి

42. తదుత్తర శ్వేతవర్ణ పదత్రయే – వాస్తోర్వామ జఠరే
మిత్రాయ నమః – మిత్రమావాహయామి

43. తదుత్తర రక్తవర్ణ వాయవ్య కోణైక పదే – వాస్తోర్వాయ హస్తే
ఓం రాజయక్ష్మణే నమః – రాజయక్ష్మారామావహయామి

44. తత్ప్రాక్ రక్తవర్ణ పదత్రయే – రాస్తోర్వాయస్థనే
పృధ్వీధరాయ నమః – పృధ్వీధర మావాహయామి

45. మధ్యే పీతవర్ణ నవపదేషు / హృన్నాభౌ –
ఓం బ్రహ్మణే నమః – తన్మధ్యే –

# వాస్తోః అంతర్మండలే

ఓమ్ వాస్తోష్పతేత్యస్య మంత్రస్య । విశ్వకర్మర్షిః । త్రిష్టుప్ ఛందః । విశ్వకర్మా దేవతా । వాస్తోష్పతిస్వరూప విశ్వకర్మ ప్రసాద సిద్ధ్యర్థే! వాస్తోష్పతి స్వరూప విశ్వకర్మారాధనే వినియోగః ॥ వాస్తోష్పతే ... ద్విపదేశం చతుష్పదే ॥ వాస్తు బ్రహ్మన్నిహాఽఽగచ్ఛ । పీతగంధం । పీతపుష్పం । పీతమాల్యాంబర ధరం । గరుడధ్వజ ఛత్ర రథపతాకాదిశోభితం । మరకత మణి కిరీటినం । మేరోః దక్షిణభాగ్ స్థితం । సుఖాసీనం । సనాతన గోత్రం । పత్నీ పుత్ర పరివారసమేతం । మండలస్య మధ్యభాగే వాస్తోష్పతి స్వరూప విశ్వకర్మాణం జగత్పాలక మావాహయామి స్థాపయామి పూజయామి ॥1॥

సద్యోజాతమిత్యస్య మంత్రస్య ఋక్ శాఖా । సానగ ఋషిః । విరాడ్విశ్వకర్మాదేవతా । గాయత్రీఛందః । మనుబ్రహ్మ ప్రసాద సిద్ధ్యర్థే । మనుబ్రహ్మారాధనే వినియోగః । ఓం సద్యోజాతం ప్రపద్యామి... భవో ద్భవాయ నమః ॥ మను బ్రహ్మన్నిహాఽఽగచ్ఛ, శ్వేత గంధం । శ్వేతపుష్పం ।

శ్వేతమాల్యాంబరధరం। వృషభధ్వజ ఛత్ర రథపతాకాది శోభితం। సద్యోజాత ముఖోద్భవం। రుద్రరూపం। తిర్యక్ త్రిపుండ్రధారిణం। మేరోః ప్రాగ్భాగే స్థితం। సుఖాసీనం। శ్వేత మణికిరీటినం। సానగర్షి గోత్రం। పత్నీ పుత్ర పరివార సమేతం మండలస్య ప్రాగ్భాగే। సద్యోజాతాఖ్యం మనుబ్రహ్మాణం। లోకపాలక మా... పూజయామి ॥2॥ గౌరీమిమాయసలిలా నేత్యస్య మంత్రస్య। ఋక్ శాఖా। సానగఋషిః। ఆదిశక్తి ర్దేవతా। గాయత్రీఛందః। గౌరీ దేవతా ప్రసాదసిద్ధ్యర్థే। గౌరీ దేవతారాధనే వినియోగః ॥ గౌరీ మిమాయసలిలాని... చతుష్పతీ .... పరమేవ్యోమన్। గౌరీ దేవతే హాఽ ఽగచ్ఛ। శ్వేతగంధాం। శ్వేతపుష్పాం। శ్వేతమూల్యాంబరధరాం। వృషభధ్వజ ఛత్రరథపతాకాది శోభితాం। శ్వేత మణికిరీటాం చంద్రకళాకృతి కుంకుమధారిణీం మేరోః ప్రాగ్భాగేస్థితాం। సుఖాషీనాం। సానగగోత్రాం। సర్వభూత పుత్ర పరివాసరమేతాం। మండలస్య ప్రాగ్భాగే। గౌరీ మావాహ .... పూజయామి ॥ 3 ॥ వామదేవాయేత్యస్య మంత్రస్య। యజుశ్శాఖా। సనాతనృషిః। స్వరాడ్విశ్వకర్మాదేవతా త్రిష్టుప్ ఛందః। మయబ్రహ్మ ప్రసాద సిద్ధ్యర్థే। మయ బ్రహ్మారాధనే వినియోగః ॥ వామదేవాయ నమో... మనోన్మనాయ నమః। మయబ్రహ్మన్నిహాఽ ఽగచ్ఛ। పీతగంధం పీతపుష్పం పీత మాల్యాంబరధరం గరుడధ్వజ ఛత్రరథపతాకాదిశోభితం। వామదేవ ముఖోద్భవం విష్ణురూపం। జ్యోతిరూపైక పుండ్రధారిణం। మేరోః దక్షిణభాగే స్థితం। సుఖాసీనం పీతమణికిరీటం। సనాతనర్షి గోత్రం। పత్నీ పుకిత్ర పరివార సమేతం। మండలస్య దక్షిణభాగే। వామదేవాఖ్యం। మయబ్రహ్మాణం లోకపాలకమా... పూజయామి ॥ 4 ॥ పక్తుమిపతితే నేత్యస్య మంత్రస్య। యజుశ్శాఖా। సనాతన ఋషిః। పరాశక్తిః దేవతా। త్రిష్టుప్ ఛందః। లక్ష్మీ దేవతా ప్రసాదసిద్ధ్యర్థే। లక్ష్మీ దేవతారాధనే వినియోగః ॥ సక్తుమివతిఉనా.... లక్ష్మీర్ని హితాధివాచి ॥ లక్ష్మీ దేవతేహాఽ ఽగచ్ఛ। హేమగంధాం ॥ హేమ పుష్పాం హేమమాల్యాంబరధరాం। గరుడధ్వజ

ఛత్రరధపతాకాది శోభితాం హేమమణికిరీటాం । తిలకరూప కుంకుమధారిణీం । మేరోఃదక్షిణ భాగేస్థితాం । సుఖాసీనాం । సనాతన గోత్రాం సకలైశ్వర్య పుత్రపరివార సమేతాం । మండలస్య దక్షిణభాగే లక్ష్మీమావా... పూజయామి ॥5॥ అఘోరేభ్య ఇత్యస్యమంత్రస్య । సామశాఖా । అహభూనఋషిః । సమ్రాడ్విశ్వ కర్మాదేవతా । జగతీఛందః త్వష్టృ బ్రహ్మ ప్రసాద సిద్ధ్యర్థే । త్వష్టృ బ్రహ్మారాధనే వినియోగః ॥ అఘోరేభ్యో... రుద్ర రూపేభ్యః త్వష్ట ృ బ్రహ్మన్నిఽఽహాగచ్ఛ రక్తగంధం । రక్తపుష్పం । రక్తమాల్యాంబరధరం, హంసధ్వజ ఛత్రకధపతాకాది శోభితం । అఘోరముఖోద్భవం । బ్రహ్మరూపం తిర్యగైక పుండ్రధారిణం । మేరోః పశ్చిమభాగేస్థితం । సుఖాసీనం । రక్త మణికిరీటం అహభూనర్షి గోత్రం । పత్నీ పుత్రపరివారసమేతం । మండలస్య పశ్చిమభాగే । అఘోరాఖ్యం । త్వష్టృ బ్రహ్మాణం లోకపాలక మా... పూజయామి ॥6॥ ప్రణోదేవీత్యస్య మంత్రస్య । సామశాఖా అహభూవఋషిః । ఇచ్ఛాశక్తిర్దేవతా । జగతీచందః। సరస్వతీ దేవతాప్రసాద సిద్ధ్యర్థే । సరస్వతీ దేవతారాధనే వినియోగః ॥ ప్రణోదేవీ సరస్వతీ .... ధీనామవిత్ర్యపత్ ॥ సరస్వతీ దేవతేహాఽఽ గచ్ఛ రక్తగంధాం । రక్తపుష్పాం । రక్తమాల్యాంబరధరాం । హంసధ్వజ చత్రరధ పతాకాది శోభితాం । రక్తమణికిరీటాం । బాలార్క కుంకుమ ధారిణీం । మేరోః పశ్చిమ భాగేస్థితాం । సుఖాసీనాం । అహభూన గోత్రాం । సకలవిద్యా పుత్రపరివార సమేతాం । మండలస్య పశ్చిమ భాగే । శ్రీ సరస్వతీ మా ... పూజయామి ॥7॥ తత్పురుషాయేత్యస్య మంత్రస్య । అధర్వశాఖా । ప్రత్న ఋషిః అభిరాడ్విశ్వకర్మా దేవతా । అనుష్టుప్ చందః । శిల్పి బహ్మ ప్రసాదసిద్ధ్యర్దే । శిల్పి బ్రహ్మారాధనే వినియోగః ॥ తత్పురుషాయ విద్మహే... రుద్రః ప్రచోదయాత్ ॥ శిల్పి బ్రహ్మన్నిహాఽఽగచ్ఛ । నీలగంధం । నీల పుష్పం । నీల మాల్యాంబరధరం । కరిధ్వజ చత్రరధ పతాకాదిశోభితం । తత్పురుష ముఖోద్భవం! ఇంద్రరూపం! ఊర్ధ్వైక పుండ్రధారిణం । మేరోః

